# ఒక వ్యక్తి రెండు కోణములు








రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



www.thraithashakam.org





# ఒక వ్యక్తి
# రెండు కోణములు


రచయిత

**త్రిమత ఏకైక గురువు**

**ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (90) గ్రంథముల రచయిత**

**ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త**

## శ్రీ.శ్రీ.శ్రీ. ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-39  ప్రథమ ముద్రణ : జూలై-2017

ప్రతులు : 1000  **వెల : 70 /-**





02 "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర
41) భావము-భాష
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.

76) నాది లోచన-నీది ఆలోచన
77) ధ్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము
90) మానవత్వము.
91) సుప్రసిద్ధి బోధ.
92) రూపము మారిన గీత.
93) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
94) యోహాను చెప్పిన జ్ఞానము
95) రాజకీయము×రాజకీయము.
96) ఉగ్రవాదము స్వర్గము కొరకే.
97) ఒక వ్యక్తి రెండు కోణములు.
98) అంతిమ దైవగ్రంథములో వజ్రవాక్యములు
99) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?

79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము
125. అక్షర జ్ఞానము
126. లలా జలము
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.



## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హాస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# ఒక వ్యక్తి రెండు కోణములు

మనిషి అనగా ఏమిటో మనుషులకందరికీ తెలుసు. మననము చేయు మనస్సునుబట్టి మనిషియని పేరు వచ్చినది. మనస్సునుబట్టి 'మనిషి', 'మానవుడు' అను పేర్లు వచ్చాయని వివరించుకొని చూస్తే తెలియుచున్నది. మనిషి తన భావములను భాషతో వ్యక్తపరచుచున్నాడు కావున అతనిని 'వ్యక్తి' అని కూడా అనుచున్నాము. మననము గలవాడు మనిషి, వ్యక్తము చేయువాడు వ్యక్తియని చెప్పుచున్నట్లు తెలియుచున్నది. మనిషి కొంత స్థూలముగా, కొంత సూక్ష్మముగా యున్నాడని అందరికీ తెలియకున్నా కొందరికయినా తెలుసు. స్థూల శరీరము పది భాగములు, సూక్ష్మశరీరము 14 భాగములు కలదని చెప్పవచ్చును. 24 భాగముల శరీరములో మూడు ఆత్మలు కూడా గలవు. స్థూల మరియు సూక్ష్మ శరీరములు రెండు ప్రకృతితో తయారయినవి కాగా, ప్రకృతి శరీరములో మూడు ప్రత్యేకమైన ఆత్మలు గలవు. దీనిని బట్టి ఒక సజీవ శరీరము ప్రకృతి మరియు ఆత్మ సంబంధమైన రెండు భాగములుగా యున్నదని చెప్పవచ్చును. ప్రకృతి భాగములు 24 కాగా, ఆత్మ భాగములు మూడు. మొత్తము 27 భాగములను వివరించుకొని చూస్తే ఈ విధముగా గలవు.



| | |
|---|---|
| 6. కాళ్ళు | 6. వ్యాన వాయువు |
| 7. చేతులు | 7. సమాన వాయువు |
| 8. నోరు | 8. ఉదాన వాయువు |
| 9. గుదము | 9. ప్రాణ వాయువు |
| 10. లింగము | 10. అపాన వాయువు |
| | 11. మనస్సు |
| | 12. బుద్ధి |
| | 13. చిత్తము |
| | 14. అహము |
| **10 భాగములు** | **14 భాగములు** |

మానవ శరీరము యొక్క మొత్తము 24 ప్రకృతి భాగములను తెలుసుకొన్నాము. రెండవ భాగమయిన ఆత్మ భాగమును వివరించుకొని చూస్తే ఈ విధముగా గలవు.

**మానవ శరీరము**

| **ప్రకృతి భాగములు** | **ఆత్మ భాగములు** |
|---|---|
| | 1) జీవాత్మ |
| | 2) ఆత్మ |
| | 3) పరమాత్మ |
| **మొత్తము 24 భాగములు** | **మొత్తము 3 భాగములు** |

**మొత్తము 27 భాగములు**

ఈ 27 భాగముల శరీరములో మూడు భాగములుగా ఆత్మ నివశించుచున్నది. సృష్ఠి పూర్వము దేవుడు ఒక్కడు తప్ప ఎవరూ లేరు. ప్రకృతి కూడా లేని ఆ సమయము ఎవరి ఊహకు అందదు. అటువంటి సమయములో దేవుడు కొంత కృషి చేసి కృతిని చేశాడు. 'కృతి'యనగా చేయబడినది అని అర్థము. దేవుడు ముఖ్యముగా చేసినది కావున 'ప్రకృతి' యని చేయబడినదానికి పేరు పెట్టబడినది. చేసినవాడు ఎవడో ఆయనకు పేరు లేదు. ఆయన ఎవరికీ తెలియనివాడు, కావున ఆయనను 'దేవుడు' యని అనడము జరుగుచున్నది. దేవుడు అనగా దేవులాడబడేవాడు గానీ, దొరికేవాడు కాడుయని అర్థము. వెతకబడేవాడే గానీ, తెలియబడేవాడు కాడు అని అర్థము వచ్చునట్లు ఆయనకు 'దేవుడు'యని పేరుపెట్టడమైనది. వాస్తవముగా అది పేరు కాదు. ఆయన ఎటువంటివాడో తెలియజేయు సూచిక యని తెలియవలెను.

ఏమీ తెలియని వానిని ఒక సూచన మేరకు దేవుడు అని అనినా, ఆయన చేసిన పనిని బట్టి ఆయనను 'సృష్ఠికర్త'యని అన్నాము. సృష్ఠికర్త యనునది కూడా పేరు కాదు. ఆయన చేసిన పనికి తగిన విధముగా పిలుస్తున్నాము తప్ప మరేమీ కాదు. దేవుడు చేసిన కృతిని ప్రకృతియని చెప్పుచున్నాము కదా! ప్రకృతిని తయారు చేసిన దేవుడు మూడు భాగములుగా విడిపోయాడు. దేవుని మూడు భాగములు, ప్రకృతి ఒక భాగము అంతయూ కలిపితే సృష్ఠి పూర్వమున్న దేవుడగును. సృష్ఠి పూర్వమున్న దేవుడు ప్రకృతితో సహా నాలుగు భాగములుగా విడిపోయాడని చెప్పవచ్చును. అలా నాలుగు భాగములుగా విడిపోయినవాడు తననుండి ప్రకృతిని మొదట తయారు చేసి, తర్వాత మిగిలిన తననుండి రెండు ఆత్మలను కూడా బయటికి పంపి, మూడవ ఆత్మగా తాను అలాగే ఉండిపోయాడు.

మొదటి ఆత్మ జీవాత్మకాగా, రెండవది ఆత్మయని పిలువబడుచున్నది. దేవుడు మూడవవానిగా ఉండి తననుండి వచ్చిన జీవాత్మ మరియు ఆత్మకంటే వేరుగా యున్నాడు కావున ఆయన పరమాత్మయని పిలువబడుచున్నాడు. ఆత్మకంటే వేరుగా యున్నాడు కావున ఆత్మ+పర=పరమాత్మయని చెప్పవచ్చును. ఎటు చూచినా ఆత్మకంటే వేరయినవాడు కావున ముందు పర తర్వాత ఆత్మయని చెప్పినా పరమాత్మనే యగును. బాగా గమనించితే పరమాత్మయనునది కూడా పేరుకాదు. దేవుడు ఉన్న విధానమును సూచించు సూచికగా పరమాత్మయని చెప్పుచున్నాము తప్ప అది కూడా పేరు కాదు.

ఈ విధముగా మొట్టమొదట సృష్ఠిని తయారు చేసినవాడు పరమాత్మ లేక సృష్ఠికర్త లేక దేవుడు అని అనవచ్చును. ఈ విషయమై అంతిమ దైవ గ్రంథములో సూరా రెండు, ఆయత్ 117లో ఈ విధముగా చెప్పారు చూడండి. **(2-117) "భూమి ఆకాశములను ప్రప్రథమముగా సృష్ఠించిన వాడు ఆయనే. ఆయన ఏ పనినైనా చేయ సంకల్పించుకొన్నప్పుడు దాన్ని 'అయిపో' అంటే చాలు అది అయిపోతుంది."** ఇక్కడ చెప్పిన వాక్యమును బట్టి మొదట భూమి, ఆకాశములను అనగా ప్రకృతిని తయారు చేసినవాడు పరమాత్మయని తెలియుచున్నది. మొట్టమొదట భూమి, ఆకాశము వాటి మధ్యగల గాలి, నీరు, అగ్నిని తయారు చేసినవాడు మొదటి సృష్ఠికర్తయని చెప్పుటకు 'ప్రప్రథమముగా తయారు చేసినవాడు ఆయనే' అన్నారు. ఆయన అనగా ఆత్మకంటే వేరుగాయున్న పరమాత్మయని జ్ఞాపకముంచుకోవలెను. ఇక్కడ మొదటి సృష్ఠికర్త పరమాత్మయని ప్రత్యేకముగా చెప్పుటకు తర్వాత రెండవ సృష్ఠిని ఆయన తయారు చేయలేదు. మొట్టమొదట ఐదు భాగములుగా యున్న ప్రకృతిని, మూడు భాగములుగా

యున్న తనను మొత్తము నాలుగు భాగములను తయారు చేసిన సృష్టికర్త, మూడు ఆత్మలలో మూడవవానిగా ఉండిపోయిన పరమాత్మ రెండవ కార్యమును చేయలేదు. పరమాత్మ అయిన ఆయన మనుషులను, జీవరాసులను సృష్టించలేదు. అయితే ఇప్పుడున్న మనమంతా మొదటి సృష్టికర్తయిన పరమాత్మ సంతతి కాదని చెప్పవచ్చును. ఈ మా మాట చాలామందికి క్రొత్తగా యుండవచ్చును గానీ, నేను చెప్పునది వాస్తవము. నా మాట వాస్తవమనుటకు అంతిమ దైవ గ్రంథములో సూరా 112, ఆయత్‌లో మూడులో ఇలా కలదు చూడండి.

**(112-3) "ఆయనకు ఎవరూ సంతతి లేరు. ఆయన ఎవరి సంతతి కాదు."**

ఈ మాటనుబట్టి పరమాత్మయను దేవుడు ఎప్పటికీ ఉండువాడనీ, ఆయన ఎవరికీ పుట్టలేదని, అట్లే ఆయనకు ఎవరూ సంతతి కాదని తెలియు చున్నది. అయితే ఇప్పుడున్న మనుషులను పుట్టించినది లేక సృష్టించినది ఎవరు? అను ప్రశ్న రాక తప్పదు. ఆ ప్రశ్నకు పరమాత్మ ఎవరినీ పుట్టించ లేదని లేక సృష్టించలేదని జవాబుగా చెప్పవచ్చును. మనిషిని తయారు చేసిన సృష్టికర్త మరొకడు గలడు. మనిషికి జన్మను, మరణమును, మరణములో తీర్పును చేయువాడు సర్వజీవరాసులను తయారు చేసినవాడు పరమాత్మ కాదు. జీవరాసులకు పరమాత్మకు సంబంధము లేదు. అయితే నేడు జఢముగా యున్న భూమి, ఆకాశము, సూర్యచంద్రులు, సముద్రములు కాక జీవరూపముగా యున్న కదలెడి ప్రాణకోటినంతటినీ సృష్టించినదెవరు? అను ప్రశ్న తప్పకవచ్చును. ఎవరో ఒకరు జీవరాసులను, మనుషులను సృష్టించాడు అని అనుకొందాము. అలా సృష్టించిన వానిని రెండవ

సృష్టికర్తయని అనవచ్చును. రెండవ సృష్టికర్తను తయారు చేసినవాడు మొదటి సృష్టికర్తయే కదా! రెండవ సృష్టిని చేసినవాడు రెండవ ఆత్మగా యున్నవాడే. రెండవ ఆత్మ స్వయముగా పనిచేసి మనుషులను సమస్త జీవరాసులను తయారు చేశాడు. జీవరాసులను తయారుచేయుటకు రెండవ ఆత్మ స్వయముగా నిర్ణయము తీసుకొన్నాడా?యని ప్రశ్నించుకొంటే దానికి జవాబు ఈ విధముగా యున్నట్లు తెలియుచున్నది.

మొట్టమొదట ప్రకృతిని సృష్టించిన దేవుడు అనగా! పరమాత్మ తన రెండవ ఆత్మ చేత జీవరాసులను సృష్టించదలచాడు. ఎందుకనగా! దేవుడయిన తాను ప్రకృతి, జీవాత్మ, ఆత్మలను తననుండి తయారు చేసి తాను పరమాత్మగా మిగిలిపోయాడు. అలా మిగిలిపోయిన పరమాత్మ తాను మొదట సృష్టిని తయారు చేసిన తర్వాత తాను పనిని చేయదలచు కోలేదు. తాను తయారు చేసిన వారిచేత పనిని చేయించి తాను ఏ కార్యమునూ చేయక ఊరక ఉండిపోదలచిన పరమాత్మ, తన తర్వాత పెద్దగా యున్న ఆత్మకు రెండవ సృష్టికార్యమును అప్పజెప్పాడు. ఆత్మ చేత జీవరాసుల సృష్టి, జీవరాసుల జీవనము, జీవరాసుల మరణము, జీవరాసుల పునర్జన్మను కలుగజేయునట్లు ఆత్మను నియమించాడు. మనిషి పుట్టుక, జీవనము, మరణము తర్వాత పునర్జన్మకు కావలసిన న్యాయ తీర్పును చేయు అధికారమును కూడా పరమాత్మయే ఆత్మకు ఇచ్చాడు. ఈ విధముగా పరమాత్మ ఆత్మకు తగిన శక్తినిచ్చి నియమించి, ఆత్మ చేయు పనులనన్నిటినీ చూస్తూయుంటూ ఏ కార్యమునూ చేయక ఊరక ఉండిపోయాడు. ఈ విధానము చేత మొదటి సృష్టి, రెండవ సృష్టియని రెండు సృష్టి విధానములు ఏర్పడినట్లయినది. మొదటి సృష్టికి పరమాత్మ అధిపతికాగా, రెండవ సృష్టికి ఆత్మ అధిపతియైనది. మొదటి సృష్టియంతటా పరమాత్మ బాధ్యత వహించి

యుండగా, రెండవ సృష్టి అయిన జీవరాసుల బాధ్యత అంతా ఆత్మ వహించి యున్నది. రెండవ సృష్టి అయిన జీవరాసుల శరీరమంతా ఆత్మ వ్యాపించి శరీరములకు అధిపతిగా ఉండగా, మొదటి సృష్టి అయిన ప్రకృతియంతా పరమాత్మ వ్యాపించి మొదటి సృష్టికంతటికీ అనగా భూమి మొదలు ఆకాశము వరకు పరమాత్మయే అధిపతిగా యున్నాడు. రెండవ సృష్టి అయిన శరీరములలో ఆత్మ వ్యాపించి శరీరములో ప్రతి పనిని చేయునదిగా ఉండగా! మొదటి సృష్టి అయిన ప్రకృతిలో పరమాత్మ వ్యాపించి యున్నా తాను పని చేయనివాడైనందున తన ప్రకృతియంతటా తన దూతలను (సేవకులను) నియమించి బయట ప్రకృతి నుండి తన పాలన సాగునట్లు చేశాడు. ఈ విధముగా రెండు సృష్టులందు ఆత్మ, పరమాత్మ పాలన సాగుచున్నది.

ఆత్మ పాలనలో 24 శరీర భాగములు పనిచేయగా! పరమాత్మ పాలనలో కోట్లాది భూతములు, గ్రహములు అను దూతలు పని చేయుచున్నారు. ఆత్మ రాజ్యమయిన శరీరము (శరీరములు) లో 24 భాగములను ఉపయోగించుకొని ఆత్మ స్వయముగా తనశక్తిని వినియోగించి కార్యములు చేయుచున్నది. పరమాత్మ రాజ్యమయిన విశ్వమంతా అనగా బయట ప్రపంచమంతా దేవదూతలు నిండియుండి పరమాత్మశక్తిని ఉపయోగించుకొని దూతలే స్వయముగా కార్యములను చేయుచున్నారు. పరమాత్మ మాత్రము ఏ పనినీ చేయక సాక్షిగా యున్నాడు. శరీరము బయట విశ్వమంతా మనుషుల కర్మలను అనుసరించి దూతలు పని చేయు చుండగా, శరీరము లోపల కర్మలను అనుసరించి ఆత్మ స్వయముగా పని చేయుచున్నది. ఈ విధముగా శరీరము లోపలి ఆత్మ, శరీరము బయటి దేవదూతలు (భూతములు, గ్రహములు) పని చేయుచూ, ఆత్మ అంశ అయిన

జీవాత్మను ప్రపంచములో జీవించునట్లు, మరణించునట్లు, తిరిగి పుట్టునట్లు చేయుచూ విశ్వకార్యమును సాగించుచున్నారు. దేవుడు మొదటి వాడుకాగా, దేవుడు మొత్తము నాలుగు భాగములుగా విభజింపబడి విశ్వనాటకమును ఆడించుచున్నాడు.

విశ్వ నాటకములో దేవుడు ఒక్కడే నాలుగు పాత్రలలో నటించు చున్నాడని అర్థమయినది. చలన చిత్రములో (సినిమాలో) ఒకే వ్యక్తి నాలుగు పాత్రలు పోషించినట్లు ఒకే దేవుడు ఒక ప్రకృతిగా, మూడు ఆత్మలుగా నటించునట్లు తెలియుచున్నది. ఈ విశ్వ నాటకములో ఒక స్త్రీ పాత్ర, మూడు పురుష పాత్రలు గలవు. స్త్రీ పాత్రను ప్రకృతి పోషించగా, పురుషుల పాత్రలను దేవుడు ఒక్కడే పోషించుచున్నాడు. మూడు పురుష పాత్రలలో ఒకటి జీవాత్మ, రెండు ఆత్మ, మూడు పరమాత్మయని ప్రథమ దైవ గ్రంథము ప్రకారము తెలియుచున్నది. స్త్రీ పాత్ర అయిన ప్రకృతిని గురించి భగవద్గీత గుణత్రయ విభాగయోగమున మూడు, నాలుగు శ్లోకములలో ఇట్లు చెప్పియున్నారు చూడండి.

శ్లో॥ 3. మమయోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్ ।
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత ! ॥

**భావము :-** అచేతన ప్రకృతి నాకు భార్యగా యుండగా, ఆమెకు నేను బీజదాతనైన భర్తగాయున్నాను. మా వలన సంతతిగా జీవాత్మ పుట్టుచున్నది.

శ్లో॥ 4. సర్వయోనిషు కౌంతేయ! మూర్తయః సంభవంతి యాః ।
తాసాం బ్రహ్మ మహద్యోనిః అహం బీజప్రదః పితా ॥

**భావము :-** అనేక గర్భములందు అనేక రూపములను ధరించి పుట్టు జీవరాసులన్నిటికీ తల్లి ప్రకృతికాగా, దేవుడనైన నేను తండ్రిగా యున్నాను.

ఈ రెండు శ్లోకముల భావము ప్రకారము ప్రకృతి తల్లిపాత్రను పోషించగా, పురుషుని పాత్రను దేవుడు పోషించగా, జీవాత్మ సంతతి పాత్రను పోషించుచున్నది. ఇక్కడ పాత్రల విషయములో కొంత అర్థముకాని పరిస్థితి ఎవరికయినా ఉన్నా, అది కొంత బుద్ధిని ఉపయోగించువారికి సులభముగా అర్థము కాగలదు. స్త్రీ పురుష తత్త్వములు ప్రపంచములో రెండే గలవు. దేవుడు మొదట ప్రకృతిని తననుండి విభజించి, ప్రకృతి వెనుక మూడు ఆత్మలుగా విభజింపబడియున్నాడు. స్త్రీకంటే పురుషునికి బలము ఎక్కువ అన్నట్లు, స్త్రీ శరీరములకంటే పురుష శరీరములే బలముగాయున్నట్లు బయటి ప్రపంచములో కనిపించుచున్నది. అదే విధముగా పురుషున్ని ఆధారము చేసుకొని స్త్రీ యున్నట్లు, దేవున్ని ఆధారము చేసుకొని ప్రకృతి గలదు. ఇదంతా శాస్త్రబద్ధముగా నిర్మాణమైయున్నట్లు మొదటి దైవ గ్రంథమయిన తౌరాత్ లేక భగవద్గీతయందు చెప్పబడియున్నది. ప్రకృతి దేవునికి భార్యపాత్రను, జీవునికి తల్లిపాత్రను పోషించుచుండగా, దేవుడు (ఆత్మ) ప్రకృతికి భర్తపాత్రను, జీవునకు తండ్రి పాత్రను పోషించుచున్నాడు. పరమాత్మ ఆత్మకు తండ్రిపాత్రను, జీవునికి తాత పాత్రను, ప్రకృతికి తండ్రి పాత్రను మరియు మామ పాత్రను పోషించుచున్నాడు. ఈ వావి వరుసలు క్రింది విధముగా యున్నట్లు తెలియవచ్చును.

**ప్రకృతి**
- జీవాత్మకు – తల్లి
- ఆత్మకు – భార్య
- పరమాత్మకు – కోడలు

**జీవాత్మ**
- ప్రకృతికి – కుమారుడు (కుమార్తె)
- ఆత్మకు – కుమారుడు (కుమార్తె)
- పరమాత్మకు – మనువడు

| | |
|---|---|
| **ఆత్మ** | ప్రకృతికి - భర్త<br>జీవాత్మకు - తండ్రి<br>పరమాత్మకు - కుమారుడు |
| **పరమాత్మ** | ప్రకృతికి - మామ (తండ్రి)<br>ఆత్మకు - తండ్రి<br>జీవాత్మకు - తాత |

ఒకే దేవుడు నలుగురుగా యుండి ప్రపంచమును ఏర్పాటుచేసి అందులో ఒకరితో మరొకరు పన్నెండు వరుసలుగా కనిపించుచున్నాడు. అందులో ఇంకా బాగా ఆలోచిస్తే పంచభూతములుగా బయట కనిపించు చున్న ఒకే ప్రకృతి కోటానుకోట్ల జీవ శరీరములుగా తయారయి ఉన్నది. కనిపించు ప్రకృతి ఒక్కటే. అదే ప్రకృతే కనిపించు కోట్ల శరీరములుగా యున్నదని తెలియవలెను. అట్లే దేవుని నుండి విడిపోయిన జీవాత్మ ఒక్కటే అయితే అదే జీవాత్మ ఎన్నోకోట్ల జీవాత్మలుగా తయారయి, తయారయిన ప్రతి దేహములో ఒక జీవునిగా కనిపించుచున్నది. అంతేకాక ఒకే ప్రకృతి ఎన్నో శరీరములుగా తయారుకాగా, అట్లే ఒకే జీవాత్మ ప్రతి శరీరములో జీవాత్మగా ఎన్నో దేహములలో ఉండిపోగా, ప్రతి జీవాత్మ వెంట ఒక ఆత్మ ఉండునట్లు ఒకే ఆత్మ, జీవాత్మయున్న ప్రతి శరీరములోనూ ఉన్నది. ప్రతి జీవాత్మ వెంట ప్రతి శరీరములో ఆత్మ ఉండగా, ఆత్మను జీవాత్మను జోడు ఆత్మలని అంటున్నాము. ప్రతి శరీరములో ప్రతి జీవాత్మకు పొరుగువానిగా ఆత్మయున్నది. ప్రతి జీవాత్మకు స్నేహితునిగా ప్రతి శరీరములోను ఆత్మ యున్నది. ఈ విధముగా అనేకచోట్ల అనేక రూపములలోనున్న శరీరములలో జీవాత్మ, ఆత్మయున్న వారితో పాటు పరమాత్మ కూడా యున్నది. జీవాత్మ

ఆత్మలు శరీరములలోనే ఉండగా, పరమాత్మ శరీరముల లోపల, శరీరముల బయట ఉన్నాడు. దీనినిబట్టి పరమాత్మ అణువణువునా వ్యాపించి యున్నాడని తెలియుచున్నది. జీవుడు లేక జీవాత్మ శరీరములో ఒకచోట రవ్వంతగా సూదిమొన మోసినంత జాగాలో ఉండగా, ఆత్మ శరీరమంతా వ్యాపించియున్నది.

ఇదంతయూ గమనిస్తే విశ్వ నాటకము యొక్క నమూనా అంతా తెలిసిపోవుచున్నది. ఈ విధముగా తయారయిన విశ్వములోని జీవరాసులు 84 లక్షల రకముల జాతులు గలవు. అందులో మనిషిజాతి ఒక రకము. కోట్లాదిగా యున్న మనుషులలో నేను ఒక మనిషిని. అలాగే నీవు ఒక మనిషివి. మనిషి అను పేరు ఎలా వచ్చినదో ముందే తెలుసుకొన్నాము. ఒక మనిషికి శరీరమొక్కటి ఉండగా, శరీరములో జీవాత్మ ఒకడున్నాడు. శరీరములో యున్న జీవుడు నేను మనిషిని అని బయట చెప్పుకొంటున్నాడు. అలా చెప్పుకొను మనిషి నేను శరీరము లోపల జీవుడను అని తెలియక, శరీరమే నేను అను భావముతో తనను శరీరముతో కూడా కలిపి చెప్పు కొంటున్నాడు తప్ప నేను వేరు, శరీరము వేరని ఏమాత్రము అనుకోవడము లేదు. శరీరముతో కలిపి నేను అను జీవుడు శరీరములో తలయందు ఒకచోట మాత్రమే ఉన్నాననిగానీ, శరీరములో అంతటావున్న ఆత్మ మరొకటి ఉందనిగానీ, శరీరము బయట, శరీరము లోపల అంతటా వ్యాపించియున్న పరమాత్మ ఒకటున్నదనిగానీ తెలియని స్థితిలో ఉన్నాడు. మనుషులలో కొందరు బయట ఆరాధనలే ముఖ్యమని తలచి తమ ధ్యాసను బయట పెట్టుకొన్నారు. మేము మంచిగా దేవున్ని ఆరాధించుచున్నామనీ, మేము దేవున్ని మంచిగా ప్రార్థన చేయుచున్నామనీ అనుకొంటున్నారు తప్ప దేవుడు తమయందే ఉన్నాడు అను ఆలోచన ఏమాత్రము లేనివారై యున్నారు.

అటువంటి వారు చేయుచున్నది మంచి పనే అయినా తమ అడ్రస్ తమకే తెలియకుండా ఇతరులకు జాబు వ్రాసినట్లు ఉంటుంది. అలాంటి జాబు చేరవలసిన అడ్రస్‌కు చేరినా అది ఎక్కడినుండి పంపినదో దానికి ఎవరికి సమాధానము ఇవ్వాలో తెలియని స్థితి ఏర్పడినట్లుండును. మనమయినా మన అడ్రస్ చెప్పకుండా ఇతరులతో వ్యాపారము చేసినా, దానిలోని లాభము మనకు చేరదు కదా! అలాగే మనిషి తనస్థితిని తెలియకుండా దేవున్ని ప్రార్థించినా అది అసంపూర్ణ ప్రార్థనయగును.

దేవుడు మనిషికి చెప్పిన ముఖ్యమైన రెండు మాటలలో రెండు ఆజ్ఞలలో మొదటి ఆజ్ఞ **'నీ పూర్ణ హృదయముతోనూ, నీ పూర్ణ ఆత్మతోనూ, నీ పూర్ణ మనస్సుతోనూ దేవున్ని ప్రార్థించుము"** అని ద్వితీయ దైవగ్రంథములో చెప్పియున్నారు. నీ పూర్ణ హృదయముతో అనగా 'నీవు ఎవరివద్ద ఉన్నావో, ఎక్కడున్నావో తెలిసి' అని భావించవలెను. అలాగే 'నీ పూర్ణ ఆత్మతో' అనగా నేను జీవాత్మగా యున్నానను సత్యము తెలిసి అని అర్థము చేసుకోవలెను. 'నీ పూర్ణ మనస్సుతో'యనగా నీతో పాటు శరీరములో యున్న ముఖ్యమైన మనస్సును తెలిసి ఆ మనస్సుతో దేవున్ని ప్రార్థిస్తే, ఆ ప్రార్థన సరియైనదను అర్థముతో దేవుడు మనిషికి చెప్పిన రెండు ముఖ్యమైన మాటలలో మొదటి మాట గలదు. ఈ మాటను ద్వితీయ దైవగ్రంథమయిన ఇంజీలులో (బైబిలులో) మత్తయి సువార్త 22వ అధ్యాయములో 37, 38 వచనములలో ఇలా కలదు చూడండి.

**(మత్తయి 22-37, 38)** అందుకాయన ***"నీ పూర్ణ హృదయముతో, నీ పూర్ణ ఆత్మతో, నీ పూర్ణ మనస్సుతో నీ దేవుడైన ప్రభువును ప్రేమించ వలెననునదే ముఖ్యమైనదియు, మొదటిదయిన ఆజ్ఞ"*** అని చెప్పినట్లు

కలదు. ఈ వాక్యము ద్వారా ముందు నీవు నీ స్థానమును తెలిసి, నీవు ఎవరో తెలిసి, నీ మనోధ్యాసతో దేవున్ని ఆరాధించమని చెప్పారు.

ఈ వాక్యములో మరొక విశేషత కలదు. ఆరాధించు నీవు నీ అడ్రస్ తెలిసి **"నీ దేవుడైన ప్రభువును"** ప్రేమించవలెనని చెప్పడమైనది. ప్రేమించడము అనగా 'ప్రార్థించడము' లేక 'ఆరాధించడము' అని అర్థము. భాషానువాదములో ప్రార్థనను ప్రేమించడము అని వ్రాశారు. 'నీ దేవుడైన' అని అంటే 'నీకు అధిపతియైన' అని భావించుకోండి. ఇక ముఖ్యమైన పదము 'ప్రభువును' అని చెప్పడము. 'ప్ర' అనగా పుట్టుక అని అర్థము గలదు. ప్ర అనగా ముఖ్యమైన అని కూడా అర్థము కలదు. అది సందర్భాను సారము ప్రక్కనగల 'భు' అక్షరము ముందర 'ముఖ్యముగా' అను అర్థము సరిపోవును. 'భు' అనగా పుట్టినయని అర్థము. 'ప్రభు' అనగా "ముఖ్యముగా పుట్టినవాడు" అని అర్థము గలదు. పరమాత్మయను మొదటి దేవుడు నుండి పుట్టినవాడు ఆత్మయను దేవుడు. ఆత్మను, పరమాత్మను ఇద్దరినీ దేవుడు యని పిలువడము జరుగుచున్నది. ఆధ్యాత్మిక విద్యను అనుసరించి దేవుడు అనగా తెలియనివాడు అని అర్థము. ఆత్మ, పరమాత్మ ఇద్దరూ తెలియబడరు, కావున ఇద్దరిని దేవుడుయని తెలుగు భాషలో చెప్పడము జరుగుచున్నది. అంతిమ దైవ గ్రంథములో కూడా ఇద్దరినీ అల్లాహ్‌యని చెప్పడము జరిగినది. అయితే ఇద్దరు దేవుళ్ల విషయము ఎవరికీ తెలియకుండా పోయినది. అల్లాహ్ అను పదము తెలుగు భాషలోనిదే.

మొదటి దేవుడయిన వాడు తననుండి ఆత్మను, జీవాత్మను సృష్టించాడు. జీవాత్మ మనిషిగా చలామణి అగుచుండగా, ఆత్మ దేవునిగా చలామణి అగుచున్నాడు. దేవుడుగా యున్న ఆత్మను ప్రభువు అని చెప్పడము జరిగినది. మొదటి దేవునినుండి లేక మొదటి సృష్టికర్త నుండి పుట్టినవాడు

రెండవ దేవుడైన ఆత్మ. కనుక ఆత్మను ప్రభువు అని చెప్పడమైనది. ప్రభువు అనగా 'ముఖ్యముగా పుట్టినవాడు' అని అర్థము. మొదటి సృష్టికర్త నుండి పుట్టినవాడు ఆత్మ అయినందున ఆత్మను 'దేవుడైన ప్రభువు' అని చెప్పారు. మనుషులందరూ ఆరాధింపవలసిన దేవుడు రెండవ ఆత్మే అయినందున మొదటి పరమాత్మను ఎవరూ ఆరాధించలేరు, ఆరాధించకూడదు, కావున మొదటి దేవుడు రెండవ దేవుడైన ఆత్మను నీ అడ్రస్ తెలిసి ఆరాధించమని వాక్యము చెప్పుచూ రెండవ ఆత్మను ప్రభువు అని చెప్పడమైనది. ఈ విధముగా మొదటివాడయిన జీవాత్మ, రెండవవాడయిన ఆత్మను ఆరాధించమని స్వయముగా మూడవవాడయిన పరమాత్మయే చెప్పి యున్నాడు. ఈ విషయము అంతిమ దైవ గ్రంథము ఖుర్ఆన్‌లో సూరా మూడు, ఆయత్ 18లో ఇలా చెప్పారు చూడండి.

**(3-18) "అల్లాహ్ తప్ప మరో ఆరాధ్య దైవము లేడని స్వయముగా అల్లాహ్, ఆయన దూతలు మరియు జ్ఞాన సంపన్నులు సాక్ష్యమిస్తున్నారు. ఆయన సమత్వము, సమతూకముతో ఈ విశ్వమును నిలిపియుంచాడు. సర్వాధిక్యుడు, వివేచనాశీలి అయిన ఆయన తప్ప మరొకరెవరూ ఆరాధనకు అర్హులు కారు."**

ఈ వాక్యములో మొట్టమొదటి సృష్టికర్తయిన అల్లాహ్, రెండవ ఆత్మయిన అల్లాహ్‌ను ఆరాధింపబడు దేవుడు అల్లాహ్‌యేనని చెప్పుచున్నాడు. అంతేకాక సృష్టి రహస్యము తెలిసిన దేవదూతలు మరియు ప్రకృతి మూడు ఆత్మల జ్ఞానము తెలిసిన జ్ఞాన సంపన్నులు కూడా అదే విషయమునే చెప్పుచున్నారు. శరీరములో అధిపతిగా యున్నవాడు మరియు శరీరములో బుద్ధియను దాని ద్వారా యోచించువాడయిన ఆత్మయే ఆరాధ్య దైవము

అని చెప్పినట్లు  పై వాక్యము సాక్ష్యముగా యున్నది.  ఆత్మలు మూడయితే అందులో మొదటివాడు జీవాత్మకాగా, మిగిలిన రెండు ఆత్మలు రెండు విధముల సృష్టికర్తలుగా యున్నారు.  అందులో 'ప్రప్రథమముగా సృష్టించిన వాడు పరమాత్మ'యనీ, రెండవ సృష్టి అయిన 'మనుషులను సృష్టించినవాడు' ఆత్మయనీ చెప్పుకొన్నాము కదా! ఆత్మ, పరమాత్మలను ఇద్దరినీ అంతిమ దైవ గ్రంథములో ఒకే పేరుతో అనగా 'అల్లాహ్' యను పేరుతో పిలువడము జరుగుచున్నది.  అదే ఇంజీలు (బైబిలు) గ్రంథములో తండ్రియని ఆత్మను, పరిశుద్ధాత్మయని పరమాత్మను చెప్పడమైనది.  అయితే అంతిమ దైవ గ్రంథములో ఆత్మను, పరమాత్మను ఇద్దరినీ ఒకే పేరుతో పిలువడము వలన  కొందరు ఆ విషయమును గ్రహించుకోలేని స్థితిలో యున్నారు. ఇద్దరు అల్లాహ్‌లు మహిమగలవారే అయి ఉండడము వలన ఎవరు ఆరాధ్య దైవము? అను ప్రశ్న రాకుండా  పరమాత్మ అనబడు మూడవ అల్లాహ్‌యే ఆత్మయనబడు రెండవ అల్లాహ్‌ను ఆరాధించమని చెప్పడము జరిగినది. అదే విషయమునే ఖుర్ఆన్‌లో సూరా 16, ఆయత్ 51లో ఇలా చెప్పారు చూడండి.

**(16-51) "అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు.  ఇద్దరు ఆరాధ్య దైవములను కల్పించుకోకండి.  ఆరాధ్య దైవము ఆయన ఒక్కడే కాబట్టి మీరంతా నాకు భయపడండి."**

ఈ వాక్యములో ఇద్దరు అల్లాహ్‌లు ఉన్నారని, వారిలో ఒక్కరినే ఆరాధించమని మూడవవాడయిన పరమాత్మయనబడు అల్లాహ్ చెప్పినట్లు కలదు.  ఇద్దరి విషయము తెలిసి  రెండవవానిని ఆరాధించమని, అప్పుడు ఆరాధ్య దైవము ఒక్కడేయగునని, మూడవవాడు చెప్పడమేకాక  ఆయనను ఆరాధించండి, అందరికీ పెద్దయిన మరియు మొదటి సృష్టికర్తయిన నాకు

భయపడండి యని కూడా చెప్పాడు. అందువలన అల్లాహ్ ఆయనే మీ ఆరాధ్య దైవమని రెండవ వానిని చూపినట్లు కలదు. ఇద్దరు ఆరాధ్య యోగ్యులు కాదని కూడా చెప్పాడు. ఇద్దరిలో మొదటి సృష్టికర్తయిన తాను 'ఏ అక్కర లేనివాడనని, ఏ ఆరాధన అవసరము లేనివాడననీ' అంతిమ దైవ గ్రంథములో సూరా 112 ఆయత్ రెండులో చెప్పారు చూడండి.

**(112-2) "అల్లాహ్ ఏ అక్కరా లేనివాడు"**

ఇక్కడ చెప్పినది మూడవ అల్లాహ్‌కనీ, 3-18 లో చెప్పినది రెండవ అల్లాహ్‌కని తెలియవలెను. తెలియలేనివారు సంపూర్ణ జ్ఞానులు కాలేరు. శరీరములోని యంత్రాంగమంతయూ తెలిసినవాడు, తాను జీవాత్మనని తెలియడమేకాక మిగతా రెండు ఆత్మల తేడాను తెలిసియుండును. అలా తెలియుట చేత రెండవ ఆత్మ అందరికీ ఆరాధ్య దైవమనీ, మూడవ ఆత్మ మొదటి సృష్టికర్తయనీ, మొదటి సృష్టికర్తే రెండవ ఆత్మను కూడా సృష్టించిన వాడనీ, రెండవ వానిని ఆరాధించినా, మూడవ వాని యెడల భయము కల్గి యుండాలని తెలిసియుండును. జ్ఞాని అయినవాడు ఇవన్నీ తెలిసి యుండాలను ఉద్దేశ్యముతో దేవుడు తన మొదటి ఆజ్ఞలో శరీరములోగల **'పూర్ణ హృదయము, పూర్ణ ఆత్మ, పూర్ణ మనస్సుతో'** యని చెప్పియున్నాడు.

నేడు దేవుడు అనినా, దేవుని జ్ఞానము అనినా సూక్ష్మముగా యున్న విషయమనీ, ప్రకృతి ఒక్కటే స్థూలముగా ఉండునదని తెలియక చాలామంది తాము జ్ఞానులము అని అనుకొంటున్నారు. శరీరము, శరీరములోని సూక్ష్మముగాయున్న పదిహేను భాగములు మరియు దేవుడు అని పిలువబడు రెండు ఆత్మల విషయము ఏమాత్రమూ తెలియనివారు వివరము తెలియని జ్ఞానము కల్గియున్నారు. అందువలన వారు సంపూర్ణ జ్ఞానులు కాదని చెప్పవచ్చును. అటువంటి వారు అల్లాహ్ (దేవుడు) ఒక్కడేయని

అంటుంటారు. అయితే ఆ ఒక్కడు ఎవరు? అను వివరము తెలియదు. ప్రార్థన చేయాలని తెలుసు కానీ ప్రార్థన దేనితో, ఎవరు ఎవరిని చేయాలని తెలియదు. ప్రతి మనిషికీ అంతిమ దినమున్నదని అంటారు. అంతిమ దినమున ప్రళయము జరుగును అంటారు. అయితే ప్రళయము యొక్క అంతిమ దినము యొక్క వాస్తవము తెలియదు. తనకు తెలియని సత్యములు ఎన్నో కలవని మనిషి గ్రహించక, ప్రతిదానినీ స్థూలముగా లెక్కించుచూ నేను సంపూర్ణమైన జ్ఞానిని అని ప్రతి మతములోని మనిషి అనుకోవడము జరుగుచున్నది. అందువలన మనిషి ఏ మతములో యున్నా మీరు దేవున్ని ఈ విధముగా ఆరాధించవలెనని తెలుపుచూ ద్వితీయ దైవ గ్రంథమున దేవుడు రెండు ఆజ్ఞలను తెలిపియున్నాడు. అలా చెప్పినా చెప్పిన ఆజ్ఞలను కూడా మనిషి తెలియకుండా రెండవ ఆజ్ఞలోని పొరుగువానిని తన ఇంటి ప్రక్కన గలవాడుగా అనుకొంటున్నారు. మొదటి ఆజ్ఞలోని విషయము ఏమిటో తెలియకనే రెండవ ఆజ్ఞ తెలిసిందియని అనుకొంటున్నారు. సంపూర్ణ జ్ఞాని అయినవాడు ఇద్దరు అల్లాహ్‌లు (దేవుళ్లు) ఉన్నారని, ఆ ఇద్దరిలో ఎవరు ఏమి చేయుచున్నారని, ఎవరు ఎవరిగా యున్నారని తెలిసియుండును.

దేవుడు మూడు దైవ గ్రంథములలో చెప్పిన జ్ఞానమును మనిషి తెలిసినవాడై మూడు గ్రంథముల జ్ఞానము ఒక్కటేయని సమన్వయ జ్ఞానమును తెలియగల్గితే, దేవుడు అంటే ఏమిటో కొద్దికొద్దిగా తెలియుటకు ఆరంభించును. అలా కాకుండా భగవద్గీత జ్ఞానము బైబిలు జ్ఞానముకంటే వేరయినదని హిందువులు అనుకొనినా, బైబిలు జ్ఞానము ఖుర్ఆన్ జ్ఞానముకంటే వేరుగాయున్నదని క్రైస్థవులు అనుకొనినా, ఖుర్ఆన్ జ్ఞానము మిగతా రెండు గ్రంథముల జ్ఞానమునకు వేరుగా కలదని ముస్లీమ్‌లు అనుకొన్నా వారికి జ్ఞానము సంపూర్ణముగా తెలియదని చెప్పవచ్చును.

ఒక గ్రంథమును సంపూర్ణముగా చదివినా ఏమీ ప్రయోజనము లేదు. మూడు దైవ గ్రంథములను చదవకపోతే, మూడు దైవ గ్రంథముల జ్ఞానమును తెలియక పోతే, అతడు ఏ ధర్మములోనూ లేనట్లేయని చివరి దైవ గ్రంథములో సూరా ఐదు, ఆయత్ 68 లో చెప్పారు చూడండి.

**(5-68) "ఓ గ్రంథవాహకులారా! మీరు తౌరాతును, ఇంజీలును (భగవద్గీతను, బైబిలును) మరియు మీ ప్రభువు తరపున మీవద్దకు పంపబడిన దానిని (ఖుర్ఆన్) మీ జీవితములలో నెలకొల్పువరకు మీరు ఏ ధర్మముపైనా లేనట్లే"**

ఈ వాక్యములో మూడు దైవ గ్రంథములను చదివి, అందులోని జ్ఞానమును జీవితములో ఆచరించకపోతే అట్టివాడు ఏ మతములోయున్నా, ఒకే దేవున్ని ఆరాధించినా ఏమి ప్రయోజనము లేదు. అతడు ఏ ధర్మములో లేనట్లే లెక్కించబడును. అందువలన సంపూర్ణ జ్ఞానము తెలియుటకు ప్రతి మనిషి మూడు దైవ గ్రంథములను చదివి, అందులోని జ్ఞానమును తెలియవలసి యున్నది. అయితే నేడు మనుషుల గుంపులోనికి దైవ జ్ఞానము అను పేరుతో 'మతము' అనునది ప్రవేశించినది. ప్రపంచము మొత్తము మీద 12 మతములు గలవు. అయినా అందులో హిందూ, ఇస్లామ్, క్రైస్థవము అను మూడు ముఖ్యమైనవి. మనుషుల సమాజములోనికి ప్రవేశించిన మతములు తమతోపాటు మత సాంప్రదాయములను కూడా ప్రవేశపెట్టాయి. ఒక మతములో యున్న మనిషి ఆ మత సాంప్రదాయము లను ఆచరిస్తూ నేను నిజముగా దైవజ్ఞానమునే ఆచరిస్తున్నానుయని అనుకోవడము జరుగుచున్నది. అలాంటప్పుడు మనిషి మతములో కూరుకు పోవుచున్నాడు తప్ప దైవజ్ఞానములోనికి ప్రవేశించలేదు. మనిషికి తెలియని

పెద్ద రహస్యము ఏమనగా! మత సాంప్రదాయములు వేరు, దేవుని ధర్మములు వేరని తెలియకపోవడము. మతసాంప్రదాయములు ఏ మతమునకు సంబంధించిన ఏ ఒక్కటిగానీ దైవ గ్రంథములలో ఉండవు. మూడు దైవ గ్రంథములలో దేవుని ధర్మములు, మూడు ఆత్మల విధానము, ప్రకృతి విధానము తప్ప ఏ సాంప్రదాయములు ఉండవు. నేడు ప్రతి మనిషి ఏదో ఒక మత సాంప్రదాయములో చిక్కుకొనియున్నాడు. అందువలన దేవుని ధర్మమునకు దూరముగా ఉండవలసి వచ్చినది. మత సాంప్రదాయము నకు దేవుని ధర్మమునకు పొత్తు కుదరదు. మత సాంప్రదాయమున్న వానిలో దైవ ధర్మముండదు. దైవ ధర్మమున్న వానిలో మత సాంప్రదాయ ముండదు. ఒకవేళ దైవ ధర్మమున్న వాడు మత సాంప్రదాయములో ఉన్నట్లు నటించవచ్చును గానీ, మత సాంప్రదాయములో యున్న వాడు దైవ ధర్మములో యున్నట్లు నటించలేడు. అటువంటి వానికి మత సాంప్రదాయము పెద్దగా కనిపించును. అదే దైవజ్ఞానముగా తెలియును. అందువలన మతములో మునిగియున్న వానికి దైవ ధర్మములు తెలియవు. ఎవరయినా చెప్పినా అవి రుచించవు. ఏ మనిషి అయినా దైవ ధర్మములు తెలియనిదే దేవుని మార్గములో ప్రయాణించలేడు. దేవుని మార్గములో పయణించుటకు మూడు దైవ గ్రంథములను చదివి అందులోని జ్ఞానమును గ్రహించగలిగితే దైవ ధర్మములు పూర్తిగా తెలియును. అప్పుడు సక్రమముగా దైవ మార్గమును అనుసరించవచ్చును.

భూమిమీద పుట్టిన ఏ మనిషి అయినా జ్ఞానిగానో, అజ్ఞానిగానో బ్రతుకుచుండును. జీవితమును సాగించు ఏ మనిషిలో అయినా అందరిలో యున్నట్లు ప్రకృతి తత్త్వము, పురుష తత్త్వము రెండూ ఉండును. పురుష తత్త్వములో మూడు ఆత్మలు శరీరములో గలవు. అందులో ఒకటి జీవాత్మ.

జీవాత్మ తాను సంపాదించుకొన్న కర్మప్రకారము శరీరములో కష్టసుఖములను అనుభవించుచుండును. ప్రతి మనిషిలో ప్రకృతి సంబంధమైనవి మొత్తము 24 శరీర భాగములు ఉన్నవి. అంతేకాక ప్రకృతి జనితములైన 108 గుణములు మూడు గుణ భాగములలో యున్నవి. సాత్త్విక, రాజస, తామస గుణ భాగములలో ఒక్కొక్క దానియందు 108 గుణములు గలవు. 108 గుణములు పూర్తిగా ప్రకృతికి సంబంధించినవికాగా, మనిషి చనిపోయినా గుణములు మాత్రము చనిపోక జీవుని వెంట వచ్చునవై యున్నవి. శరీర భాగములన్ని మరణములో శిథిలమై పోయినా, గుణములు మాత్రము శిథిలముగాక శరీరముతో పాటు జీవున్ని వదలి పోకుండా మరుజన్మకు వచ్చుచుండును. అటువంటి గుణములను ఆధారము చేసుకొని జీవుని కర్మను అనుసరించి శరీరములో రెండవ ఆత్మ కార్యములను చేయుచుండగా, ఆ కార్యములలో వచ్చు కష్టసుఖములను జీవాత్మ (జీవుడు) అనుభవిస్తున్నాడు. జీవుడు గుణముల మధ్య నివాసముంటున్నాడు. అందువలన గుణముల వలన కలుగు కార్యముల అనుభవములను అనుభవించుచున్నాడు.

శరీరములో ఆత్మ అధిపతిగా (ఈశ్వరునిగా) యుండి, సర్వ కార్యములను కర్మప్రకారము చేయుచుండగా, ఆ కార్యముల ఫలితములను అనుభవించుట జీవాత్మ ధర్మమయినది. మనిషిలోని కర్మప్రకారము గుణ ప్రేరేపితము చేసి, అనగా గుణములను వాడుకొని గుణముల ప్రకారము ఆత్మ పనిని చేయుచుండును. ఆత్మ మనిషి శరీరములో ఒక్కక్షణము కూడా ఊరక ఉండక శరీరాంతర్గత, శరీర బహిర్గత కార్యములను చేయుచున్నది. ఆత్మకు అలసట లేదు, అందువలన ఎల్లప్పుడు, ఎల్లవేళల శరీరములో ఆత్మ పని చేయుచుండును. జీవాత్మ అయితే మెలుకువలో ఉన్నప్పుడు మాత్రము పాపపుణ్య ఫలితములయిన కష్టసుఖ అనుభవములను పొందు

చుండును. నిద్రలో ఏ అనుభవము లేకుండా విశ్రాంతి పొందియుండును. అయితే ఆత్మకు అటువంటి సౌకర్యము లేదు. ఎల్లప్పుడు అన్ని కాలములలో పని చేయవలసియున్నది. ఇకపోతే మూడవ ఆత్మ అయిన పరమాత్మ దేనితో సంబంధము లేకుండా శరీరములో జరుగు కార్యములను జీవుడు అనుభవించు అనుభవములను చూస్తూ సాక్షిగాయున్నాడు. అందువలన ఇదే విషయమునే అంతిమ దైవ గ్రంథములో సూరా 50, ఆయత్ 21లో మూడు ఆత్మల విధానమును ఇలా చెప్పియున్నారు చూడండి.

**(50-21) "ప్రతి మనిషి ఒక తోలేవాడితోనూ, ఒక సాక్షిగా యున్న వానితోనూ కలిసి వస్తున్నాడు."**

ఈ వాక్యములో 'త్రోలబడేవాడు జీవాత్మ, త్రోలేవాడు ఆత్మ, చూసేవాడు పరమాత్మ'యని తెలియునట్లు చెప్పియున్నారు. ఈ వచనమును చదివినప్పటికీ మూడు ఆత్మలను గుర్తించక మిగతా రెండు ఆత్మలను మనిషి వెంట అంతిమ దినమున వచ్చు దేవదూతలుగా అర్థము చేసుకొన్నారు అదే విషయమునే ఇతరులకు కూడా చెప్పి వాస్తవ జ్ఞానమునకు తాము దూరముగా పోవడమే కాక ఇతరులను కూడా దూరముగా పంపుచున్నారు. ముఖ్యముగా ప్రతి మతములోనూ మత పెద్దలుగానో, మత బోధకులుగానో కొందరుండడము జరుగుచున్నది. అటువంటి బోధకులు తాము దైవ గ్రంథము నుండి తప్పు భావమును గ్రహించుకొని, అదే సత్యమని నమ్మి ఇతరులకు కూడా తాను తెలిసిన దానినే చెప్పడము వలన వారి మాటలు వినిన వారందరూ తప్పుదారి పట్టి అజ్ఞానులుగా మారుచున్నారు. అయినా వారు తమను తాము జ్ఞానులుగా చెప్పుకొంటున్నారు.

మనిషి శరీరములో ప్రకృతి మరియు మూడు ఆత్మలున్నాయని తెలుసుకొన్నాము. అంతేకాక శరీరములో లెక్కింపబడు 24 ప్రకృతి

భాగములు కాకుండా, మూడు ఆత్మలు కాకుండా, సూక్ష్మములో మరీ సూక్ష్మమైన ప్రకృతిలో పుట్టిన గుణములు మరియు ఆత్మ జనితమైన బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములు మనిషి తలలో ఏర్పాటు చేయబడినాయి. బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రముల ఆకారమును క్రింద పటములో చూడవచ్చును. ఇది భగవద్గీతలో అక్షర పరబ్రహ్మయోగమును అనుసరించి మరియు పురుషోత్తమప్రాప్తి యోగము, గుణత్రయ విభాగ యోగములను అనుసరించి శాస్త్రబద్ధముగా చెప్పడమేకాక చిత్రముగా గీచి చూపించడమైనది.

క్రింది చిత్రము ఒక మానవుని తలలోనే కాకుండా కర్మతో పుట్టిన ప్రతి జీవరాసి శరీరములోనూ కలదని తెలియవలెను. ఇప్పుడు




బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రముల చిత్రము

మేము గీచి చూపిన నాలుగు చక్రముల గుర్తు హిందూమతము వారికే కాకుండా మిగతా మతముల వారికి కూడా క్రొత్తగా కనిపించుచుండును. ప్రథమ దైవ గ్రంథములో ఈ చిత్రమునకు పేరు లేకున్నా ద్వితీయ మరియు అంతిమ దైవ గ్రంథములలో ప్రత్యేకమయిన పేరు పెట్టబడినది. ద్వితీయ దైవగ్రంథమయిన ఇంజీలు (బైబిలు) లో **'దేవుని ముద్ర'**యని, తృతీయ దైవ గ్రంథమయిన ఖుర్‌ఆన్‌లో **"దేవుని చిహ్నము"** యని చెప్పారు. దేవుని చిహ్నము అనినా, దేవుని ముద్ర అనినా రెండూ ఒకే అర్థము. ఖుర్‌ఆన్ గ్రంథములో దేవుని చిహ్నమును గౌరవించవలెను అని సూరా 22 ఆయత్ 32లో చెప్పియున్నారు. దానిని ఇప్పుడు చూస్తాము.

**(22-32) "అల్లాహ్ చిహ్నాలను ఎవరయినా గౌరవిస్తున్నారంటే అది వారి హృదయాలలోని భక్తి భావన వలననే"**

ఈ వాక్యమును చాలామంది తప్పుగా అర్థము చేసుకొని ప్రకృతి వస్తువులను, ప్రకృతి ఆకారములను (జీవులను) దేవుని చిహ్నములుగా చెప్పుకొంటున్నారు. సృష్ట్యాదిలో దేవుని నాలుగు భాగములకు గుర్తుగా నాలుగు చక్రములు ఒకే ఇరుసుకు తగిలించబడ్డాయి అని, నాలుగు చక్రములు దేవుని చిహ్నములుగా ఉన్నాయని తెలియలేకపోయారు. బైబిలు గ్రంథములో యోహాన్ ప్రకటనలు అను దానిలో 9వ అధ్యాయము 4వ వచనములో 'దేవుని ముద్ర' యని వ్రాశారు చూడండి.

**యోహాన్ ప్రకటనలు (9-4) "నొసళ్లయందు దేవుని ముద్ర లేని మనుష్యులకే తప్ప భూమిమీదగల గడ్డికైనను, ఏ మొక్కల కయినను, మరి ఏ వృక్షమునకైనను హాని కలుగజేయకూడదని వాటికి ఆజ్ఞ ఇవ్వబడెను."**

ఈ వాక్యములో నుదుటి మీద ధరించెడి దేవుని ముద్రయని చెప్పుట వలన అది ప్రత్యేకమైన అర్థముతో కూడుకొన్న గుర్తుయని అర్థమగుచున్నది. ఆ గుర్తు ఎలాగుంటుందో ద్వితీయ, తృతీయ దైవ గ్రంథములలో చెప్పక పోయినా ప్రథమ దైవ గ్రంథము భగవద్గీతలో పూర్తి సమాచారము ఉండుట వలన దేవుని ముద్ర చిత్రమును సులభముగా గీచి చూపగలిగాము. దీనిని జీవుడనైన నేను చూపడము లేదు. శరీరములో అధిపతిగాయున్న ఆత్మ ప్రేరణవలన గీయబడినదని తెలియండి. ఈ గుర్తును గీచి చూపడము వలన శరీరములో జీవాత్మ క్రింది చక్రములో గల మూడు గుణ భాగములలో ఏదో ఒక భాగములో ఉన్నాడని తెలియుచున్నది. అంతేకాక మనిషి సంపాదించిన కర్మ ఎక్కడ నిలువయున్నది కూడా తెలిసిపోవుచున్నది. ద్వితీయ దైవ గ్రంథములో **'పూర్ణ హృదయముతో'** అన్నప్పుడు దానిలో నాలుగు చక్రముల ముద్ర కూడా చేరిపోవుచున్నది. దేవున్ని మొదటి ఆజ్ఞ ప్రకారము జీవుడు నివసించు విధానము కూడా తెలిసి, దేవున్ని ప్రార్థించాలి అనుమాట అర్థమగుచున్నది. ఇదంతయూ తెలిసిన తర్వాత ప్రతి మనిషి లోని విధానము అంతయూ తెలియుచున్నది. మనిషి అనువాడు జ్ఞాని కావచ్చు, అజ్ఞాని కావచ్చు అతను ఎవడయినా శరీరము లోపలి విధానము అంతా ఇంతేనని తెలియడమే మొదటి జ్ఞానము. దానినే దేవుడు మొదటి ఆజ్ఞగా చెప్పాడు. దేవుడు చెప్పిన మొదటి ఆజ్ఞ ప్రకారము ప్రతి మనిషి తన శరీరములో తాను ఎక్కడ గలడో తెలియాలి.

మీకు చాలామందికి తెలియని వివరమును చెప్పిన నేను శరీరములో మీరు ఎట్లున్నారో, నేను కూడా అట్లే యున్నానని చెప్పుచున్నాను. ఎంత జ్ఞాని అయినా, ఎంత అజ్ఞాని అయినా శరీరము ధరించి యుండడము సహజము. అట్లే అందరూ అంతర్గతములో ఎట్లున్నారో అట్లే ఉండడము

సహజము.  శరీర విధానములో ఎవరికీ అనగా, ఏ మనిషికీ మార్పు ఉండదు.  భూమిమీద పుట్టిన ప్రతి మనిషి ఒకే కోణములో ఉండగా మనుషులకు దేవుడయినవాడు మనిషికి  అనగా జీవునికి భిన్నమైన రెండవ కోణములో యున్నాడు.  ఒక కోణములో యున్న మనిషి రెండవ కోణములో యున్న దేవున్ని తెలియుటకు ఒక విద్యను నేర్చవలసి యుంటుంది.  దానినే బ్రహ్మవిద్య అని అంటారు.  బ్రహ్మ అనగా పెద్దయని అర్థము.  బ్రహ్మవిద్య అని అంటే పెద్ద విద్యయని అర్థము.  దానినే ఆధ్యాత్మిక విద్యయని అంటారు. బ్రహ్మవిద్యను నేర్చిన వానికి  దైవ గ్రంథములో దేవుడు మనుషులకు చెప్పిన ముఖ్యమైన రెండు ఆజ్ఞలు ఏమిటో సులభముగా తెలియును.  రెండు ఆజ్ఞలు తెలిసిన వానికి శరీరములోగల యంత్రాంగమంతయూ సులభముగా అర్థమయి ఉండును.  అలా అర్థమయినవాడు  మనిషి ఏ కోణములో ఉన్నాడో, దేవుడు ఏ కోణములో ఉన్నాడో తెలియగలడు.  అప్పుడు మనిషి జీవుని కోణము వేరు, దేవుని కోణము వేరని తెలియగలడు.  ద్వితీయ దైవ గ్రంథము మత్తయి సువార్త 22వ అధ్యాయము 39,40 వచనములలో ఇలా వ్రాశారు చూడండి.

**మత్తయి (22-39,40) "నిన్నువలె నీ పొరుగువానిని ప్రేమించవలెనను రెండవ ఆజ్ఞయు దానివంటిదే.  ఈ రెండు ఆజ్ఞలు ధర్మశాస్త్రమునకంతటకిని, ప్రవక్తలకును ఆధారమైయున్నవని అతనితో చెప్పెను."**

రెండు ఆజ్ఞలు ధర్మశాస్త్రమునకు ప్రవక్తలకు ఆధారమైయున్నవని చెప్పుట వలన  ఈ రెండు వాక్యములను జాగ్రత్తగా అవగాహన చేసుకోవలసి యున్నది.  మొదటి ఆజ్ఞను ఇంతవరకు చెప్పుకొన్నాము.  ఇప్పుడు రెండవ ఆజ్ఞలోని ముఖ్యముగా **'నిన్నువలె నీ పొరుగువానిని'** అని యున్నది.  దీనిలో

**నీవు ఎవరు? నీ పొరుగువాడు ఎవడు?** అను రెండే ముఖ్యముగా యున్నవి. నీవు జీవాత్మవనీ, నీ పొరుగువాడు ఆత్మయనీ తెలిసి, పొరుగువాడయిన ఆత్మయే హిందువుల దేవుడు, ముస్లీమ్‌లకు ఆరాధింపతగిన అల్లాహ్ యని తెలియడము ముఖ్యము. అలా నిన్ను నీ వెనుక ఆత్మగాయున్న ఆత్మను తెలియడమే నిజమైన దైవజ్ఞానము. అందువలననే దేవుడు చెప్పిన రెండు ఆజ్ఞలు ధర్మశాస్త్రమునకు మరియు ప్రవక్తలకు ఆధారమైన వాక్యములని చెప్పారు. ఇదే విషయమునే నేను గ్రంథ ప్రారంభము నుండీ చెప్పుచున్నాను. ఈ రెండు ఆజ్ఞలు శరీరము లోపల ఇమిడియున్నవి. శరీరయంత్రాంగము తెలిసినవాడు రెండు ఆజ్ఞల సారాంశమును తెలియగలడు. రెండు ఆజ్ఞలను తెలిసినవాడు తన కోణమును, దేవుని కోణమును తెలియగలడు.

ఇంతవరకు మనిషిలో రెండు కోణములు గలవని ఒక కోణములో జీవాత్మయుండగా, మరొక కోణములో ఆత్మ మనిషికి ఆరాధింపతగిన వాడుగా యున్నాడని తెలియగలిగాము. శరీరములోని రెండు కోణములు తెలిసి రెండవ కోణములో యున్న దైవమును (ఆత్మను) ఆరాధించడమే ధర్మశాస్త్రములో చెప్పిన ముఖ్యమైన జ్ఞానమని తెలిసినది. అయితే మనుషులుగా యున్నవారు శరీరము బయట ధ్యాసతో, శరీరము బయట జ్ఞానమునే తెలిసి, శరీరము బయట ఆరాధనలే చేయుచూ, శరీరము బయట ప్రార్థనలే చేయుచున్నారు. శరీరము లోపలి విధానము తెలియకుండా బయట చేయు ఆరాధనలు, ప్రార్థనలు దేవుని లెక్కలో సరియైనవికాదనీ, అది ధర్మశాస్త్రములో ధర్మముకాదనీ, ప్రవక్తలు చెప్పు జ్ఞానము కూడా కాదనీ ద్వితీయ దైవ గ్రంథమున చెప్పిన రెండు ఆజ్ఞలను చూచాము. మనిషి ఏ మతములో యున్నా రెండు ఆజ్ఞల ప్రకారము తప్పక నడువవలసియుండును. అయితే నేడు దైవ గ్రంథములోని 'దేవుడు ఒక్కడే'యను మాటను మాత్రము

పట్టుకొని మేము ఒకే దేవున్ని ఆరాధించుచున్నాము. దేవున్ని మినహా ఎవరినీ ఆరాధించలేదు అని చెప్పినా వారు రెండు ఆజ్ఞలకు లోబడి నడువలేదు, కావున వారు చేయు ఆచరణలు, ఆరాధనలు అన్నీ బయటివే అగుచున్నవి. కనుక సారాంశము లేనివిగా వృథా అయిపోవుచున్నవి.

మనిషి గత జన్మల కర్మవలన మళ్లీ మళ్లీ పుట్టుచున్నాడు. దైవ జ్ఞానము తెలియని దానివలన పుట్టిన ప్రతి జన్మలోనూ కర్మను సంపాదించు కొంటున్నాడు. దానిని అనుభవించుటకు తిరిగి పుట్టుచున్నాడు. ఈ విధముగా మనిషికి జనన మరణములు సర్వసాధారణముగా ఉంటున్నాయి. కర్మలనుండి బయటపడి జన్మలకు పోకుండా దేవునిలోనికి ఐక్యమగుటకు తగిన ఉపాయముగా దేవుడు తన జ్ఞానమును ప్రజలకు చెప్పాడు. ప్రజలు దేవుని జ్ఞానము తెలియుట వలన, తెలిసి ఆచరించుట వలన, వారి ఆచరణలలో అనగా ఆరాధనలలో జ్ఞానశక్తి మనిషికి లభించును. జ్ఞానశక్తినే భగవద్గీతలో 'జ్ఞానాగ్ని' అని కూడా చెప్పారు. కర్మలను కట్టెలుగా, జ్ఞానమును అగ్నిగా పోల్చి ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీతలో చెప్పడమైనది. అదే విషయమునే మిగతా రెండు దైవ గ్రంథములలో కూడా చెప్పారు. గీతలో **'కర్మదహనము'** అని చెప్పిన మాటనే ఇతర దైవ గ్రంథములలో **'పాప క్షమాపణ'**యని అన్నారు. పాప పుణ్యములు రెండూ కలిసి కర్మకాగా, కర్మను దేవుని జ్ఞానము దహించి లేకుండా చేయుచున్నది. ఈ విషయమును శాస్త్రబద్ధముగా తెలియాలంటే భగవద్గీత జ్ఞానయోగమునందు 37వ శ్లోకములో చెప్పియున్నారు చూడండి.

శ్లో॥ 37. యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥

**భావము :** అగ్నిలో ఎన్ని కట్టెలైనాగానీ కాలి బూడిద అయినట్లు, జ్ఞానమను అగ్నిచేత సర్వకర్మలు అనుమానము లేకుండా కాలి భస్మమైపోవుచున్నవి.

నేడు మనుషులుగా యున్నవారు మతములను బట్టి, కొన్ని మత గుంపులుగా విభజింపబడినారు. ఉదాహరణకు ఒక పట్టణములో లక్షమంది జనాభా యుంటే అందులో 30 వేలు ముస్లీమ్‌లు, 30 వేలు క్రైస్థవులు, 40 వేలు హిందువులు ఉన్నారని అనుకొనుము. అప్పుడు వారు మూడు సమాజములుగా విభజింపబడియున్నారు. మూడు వేరువేరు సమాజములుగా ఉండడమేకాక, వేరు వేరు సాంప్రదాయములను కల్గియున్నారు. వేరువేరు సాంప్రదాయములనే తమతమ జ్ఞానముగా చెప్పుకొంటూ మేము ఆరాధించు దేవుడు వేరు, మీరు ఆరాధించు దేవుడు వేరని అంటున్నారు. అంతటితో ఆగక మా దేవుడు ఈ విధముగా మా గ్రంథములో చెప్పాడు. మీ దేవుడు వేరు విధముగా మీ గ్రంథములో చెప్పాడు అని దేవున్ని వేరు చేయడమే కాకుండా దైవ గ్రంథములను, అందులోని జ్ఞానమును వేరు వేరు చేసి చూపుచున్నారు. అటువంటప్పుడు శరీరాంతర్గత జ్ఞానమును వదలి బయటి సాంప్రదాయములలోనూ, బయటి ఆరాధనలలోనూ వేరువేరుగా పోవునట్లు కనిపించుచున్నారు. దైవజ్ఞానమును శరీరములో తెలియక, శరీరములో అందరికీ ఒకే విధానమున్నదని తెలియకపోవడము వలన ఎవరి ఆరాధనల లోనూ జ్ఞానశక్తి లేకుండా పోయినది. మనిషి చేయు ఆరాధనలో అట్లే మనిషి తెలియు జ్ఞానములో జ్ఞానమను అగ్ని ఉండవలెను. అయితే దేవుని ఆజ్ఞల ప్రకారము కాకుండా స్వంతముగా ఏర్పాటు చేసుకొన్న విధానము ప్రకారము మనుషులు ప్రార్థన చేయడము వలన ఆ ప్రార్థనలలో జ్ఞానాగ్ని లేకుండా పోయినది. జ్ఞానాగ్ని లేనిదానివలన మనిషి చేసుకొన్న కర్మలు కాలిపోవడము లేదు. అనగా దైవము చేత క్షమించబడలేదు.

అటువంటప్పుడు బయట ప్రపంచములో ఎంతటి పెద్ద బోధకుడుగా గానీ, గురువుగాగానీ ఉండినప్పటికీ ఏమీ ప్రయోజనము ఉండదు. కర్మ కాలదు, పరలోక ప్రాప్తి లభించదు. పదిమందికి జ్ఞానమును చెప్పినా అది వారిని తప్పుదారిలో పోవునట్లు చేయుచుండుట వలన వారు బోధించడము వలన కూడా పాపమును సంపాదించుకొనుచున్నారు. పాపము రాకూడదంటే, దేవుని మార్గములో సక్రమముగా పోవాలంటే దేవుడు ద్వితీయ దైవ గ్రంథములో చెప్పిన రెండు ఆజ్ఞలను తెలిసి దాని ప్రకారము ఆచరించవలెను. రెండు ఆజ్ఞలు ధర్మశాస్త్రమునకు, ప్రవక్తలకు కూడా ఆధారమైయుండుట వలన ఆ రెండు ఆజ్ఞల ప్రకారము నడువగలిగినప్పుడే మనిషి కర్మ పోవును, లేకపోతే బయట ప్రపంచములో బోధించు బోధలు, చేయు ఆరాధనలు వృథాయగును.

**ప్రశ్న :- ద్వితీయ దైవ గ్రంథమయిన బైబిలులో మత్తయి సువార్త 22వ అధ్యాయమున 37 నుండి 40వ వాక్యము వరకు చెప్పినది మనిషిగా యున్న ఏసు అను వ్యక్తి కదా! అంతవరకు దేవుడు చెప్పని ఆ రెండు వాక్యములను రెండు ఆజ్ఞలుగా చెప్పి ఇవి దేవుని ఆజ్ఞలు వాటి ప్రకారము దేవున్ని ఆరాధించమని చెప్పాడు కదా! చెప్పినది కనిపించే మనిషి, చెప్పిన ఆజ్ఞలు రెండూ ధర్మశాస్త్రమునకు, ప్రవక్తలకు ఆధారమైనవని చెప్పాడు. దేవుడు చెప్పిన మాటలు ప్రవక్తలకు, ధర్మశాస్త్రమునకు ఆధారము కావచ్చును గానీ మనిషి చెప్పిన మాటలు ఎలా ధర్మశాస్త్రమును శాసించగలవు. ఎలా ప్రవక్తలకు ఆధారము కాగలవు. ఇవి దేవుడు చెప్పిన మాటలు కాదని ఏసు అను ఒక బోధకుడు చెప్పిన మాటలని తెలిసినప్పుడు ఆ మాటలను దేవుని ఆజ్ఞలని ఎలా నమ్మాలి? దీనికి మీరు మాకు అర్థమగునట్లు సమాధానము చెప్పండి.**

**జవాబు :-** సృష్ఠి తర్వాత దేవుడు మొదట ఆకాశము ద్వారా శబ్దరూపములో తన జ్ఞానమును చెప్పాడు. అప్పుడు ఆకాశములో యున్న సూర్యుడు ఆకాశ శబ్దము ద్వారా వచ్చిన జ్ఞానమును గ్రహించాడు. ఆకాశము నుండి వచ్చిన శబ్దము మనుషులకు వినిపించినా అది వారికి అర్థము కాలేదు. ఆకాశము లోని మేఘములు ఉరుముల రూపములో చెప్పిన జ్ఞానమును ఆ రోజు సూర్యుడు గ్రహించి తర్వాత కొంతకాలమునకు భూమిమీద దక్షిణ భారతదేశముననున్న **'మనువు'** అను వ్యక్తికి తెలుగు భాషలో చెప్పాడు. ప్రపంచములో మొట్టమొదట పుట్టిన భాష తెలుగు భాష. సూర్య గ్రహము భూమిమీద ఇతర మనిషిలో ఆవహించి చెప్పినప్పుడు, మనువు అను వ్యక్తి దానిని పూర్తి తెలియగలిగి ఇతరులకు చెప్పడము జరిగినది. మొదట ఆకాశము నుండి శబ్దరూపములో వినిన జ్ఞానము సూర్యుని నుండి మనువుకు, మనువు నుండి ఇక్ష్వాకుడు అను రాజుకు, ఇక్ష్వాకుడు నుండి ఇతర రాజులు, ఋషులు మొదలగువారు విని తెలుసుకోవడము జరిగినది. అలా భూమిమీద చాలా ప్రాంతములలోనికి ప్రాకిన జ్ఞానము మాటల రూపములో ఒకరినుండి మరొకరికి ప్రాకినది. అలా శబ్దరూపములో మొదట తెలిసిన జ్ఞానము ప్రకృతికంటే వేరుగాయున్న దేవున్ని గురించి చెప్పినది అయినందున మరియు పుట్టిన దానికంటే వేరుగాయున్న దేవుని జ్ఞానమును చెప్పినందున, మాటల రూపములోయున్న జ్ఞానమునకు **జపర** అను పేరు పెట్టారు. **జ** అనగా పుట్టుట **పర** అనగా వేరుగాయున్న అని అర్థము. దేవుడు పుట్టనివాడు, కావున ఆయనను గురించి చెప్పిన జ్ఞానమును జపర జ్ఞానము అని చెప్పెడివారు. జపర జ్ఞానము ద్వాపరయుగము చివరిలో కృష్ణుని ద్వారా అర్జుననకు, అర్జునుని ద్వారా వ్యాసునికి తెలిసినది. వ్యాసుడు తనకు తెలిసిన జపర జ్ఞానమును గ్రంథరూపములో వ్రాశాడు.

గ్రంథరూపమైన దానిని వ్యాసుడు **'భగవద్గీత'**యని పేరు పెట్టాడు. తర్వాత కొంతకాలమునకు స్వయముగా కృష్ణుడే మోషే ప్రవక్తకు భగవద్గీతను ఇచ్చి దాని పేరు **'తౌరాతు'** యని చెప్పాడు. తౌరాతు గ్రంథమును ఆ రోజులలో మోషే ప్రవక్త ఒక్కడు చూచాడు.

మోషే తర్వాత దానిని తౌరాతు అను పేరుతో ఎవరూ చూడలేదు. భగవద్గీత అను గ్రంథము పేరుతో జపర జ్ఞానము తయారయినది. దేవుని జ్ఞానము మొట్టమొదట భగవద్గీతయను గ్రంథరూపములో వ్రాయబడుట వలన ఆ గ్రంథమును ప్రథమ దైవ గ్రంథము అని అన్నారు. ఈ విధముగా మాటల రూపములోయున్న జపర జ్ఞానము ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీతగా తయారయినది. తర్వాత శ్రీకృష్ణుడే తన భగవద్గీతకు తౌరాతు యని పేరుపెట్టగా ఆ పేరు నేటికినీ భూమిమీద ఉన్నప్పటికీ భగవద్గీతే తౌరాతుయని ఎవరికీ తెలియదు. మొదట జపర యను పేరుతో మాటల రూపములో యున్న జ్ఞానము భగవద్గీతయను పేరుతో తయారుకాగా, తౌరాతు యను పేరుతో అదే గ్రంథమే మోషేకు ఇవ్వబడినది. ఈ విధముగా దేవుడు చెప్పిన జ్ఞానము జపర, భగవద్గీత, తౌరాతు యను మూడు పేర్లతో చెప్పబడినది. **జపర** అను మొదటి పేరు కొద్దిగా మార్పుచెంది **జబుర** అను పేరుతో నేడు చెప్పబడుచున్నది.

భగవద్గీత తర్వాత కలియుగములో రెండువేల సంవత్సరముల క్రితము దేవుని జ్ఞానము ఏసు ద్వారా చెప్పబడి **ఇంజీలు** అను గ్రంథ రూపములో తయారయినది. ఇంజీలు గ్రంథమునే నేడు బైబిలు అను పేరుతో పిలుస్తున్నాము. దాని తర్వాత జిబ్రయేల్ అను గ్రహము ద్వారా ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పిన జ్ఞానము ఖుర్ఆన్ గ్రంథముగా తయారయి నది. దేవుని జ్ఞానము మూడు గ్రంథములుగా తయారుకాగా ఆ మూడు

గ్రంథములను వరుసగా ప్రథమ, ద్వితీయ, అంతిమ దైవ గ్రంథములని చెప్పడము జరిగినది. మూడు దైవగ్రంథములకు **భగవద్గీత, బైబిలు, ఖురాన్** అను పేర్లను మనుషులు పెట్టగా, స్వయముగా దేవుడు రెండు గ్రంథములకు పెట్టిన పేర్లు **తౌరాతు, ఇంజీలు.** దైవజ్ఞానమునకు గ్రంథరూపములో ఐదు పేర్లు, గ్రంథము కానప్పుడు జపర ఒక పేరు మొత్తము ఆరు పేర్లు ఉండడము జరిగినది. ఇందులో భగవద్గీత పేరు తౌరాతుయనీ, బైబిలు పేరు ఇంజీలుయని అనడమైనది. మూడు గ్రంథములలో ఒకే దేవుని జ్ఞానమున్నట్లు చాలామంది మనుషులు గ్రహించలేకపోయారు.

ప్రథమ, ద్వితీయ దైవ గ్రంథములయిన భగవద్గీత, బైబిలు అను రెండు గ్రంథములను మానవ రూపములోయున్న దైవమే చెప్పాడని చాలామందికి తెలియదు. దేవుడు మనిషి రూపములో ఉండి, మనుషుల భాషలో, మనుషులకు బోధను చెప్పాడు. అదే ఏసు రూపములో ఉండి తన జ్ఞానమును చెప్పాడు తప్ప, చెప్పిన ఏసు సాధారణ మనిషి కాడు. సాధారణ మనిషిగా కనిపించిన శ్రీకృష్ణుడు, ఏసు స్వయముగా దైవజ్ఞానమును చెప్పారు. కృష్ణుడు ఒక కోణములో మనుషులకు జ్ఞానమును చెప్పగా, ఏసు మరొక కోణములో మనుషులకు జ్ఞానమును చెప్పాడు. ఇద్దరూ వేరువేరు భాషలలో, వేరువేరు కోణములలో చెప్పడము వలన వేరువేరు జ్ఞానముగా కనిపించియుండవచ్చును. అయితే ఇద్దరు చెప్పిన జ్ఞానము ఒక్కటే, ఒకే దేవున్ని గురించి చెప్పినదే.

**ప్రశ్న :- కృష్ణుడు, ఏసు ఇద్దరూ మనుషులే అయినా వారి రూపములో దేవుడు జ్ఞానము చెప్పాడు అని అన్నారు. దేవుడు మనిషి రూపములో**

**భూమిమీదికి వస్తాడా? దేవుడు మనిషిగా వచ్చినప్పుడు  ఆయన దేవుడని ఎవరూ గుర్తించలేరు కదా! అలాంటప్పుడు మనుషులయిన కృష్ణున్ని, ఏసును దేవుని అవతారమని ఎలా చెప్పుటకు వీలగును.  దేవుడు కనిపించువాడు కాదని దైవగ్రంథములలో చెప్పబడినది.  దైవ గ్రంథముల ప్రకారము దేవున్ని ఎవరూ చూడలేదని తెలియుచున్నది.  అలాంటప్పుడు దేవుడు మనిషిగా యుంటే అందరికీ తెలియును కదా! అప్పుడు దైవ గ్రంథములలో దేవుడు చెప్పినమాట అసత్యమగును కదా!  అట్లు దేవుని మాట అసత్యమగుటకు అవకాశముండునా? ద్వితీయ దైవ గ్రంథము (యోహాను 5-37) లో "ఆయన స్వరమును ఎవరూ వినలేదు.  ఆయన రూపమును ఎవరూ చూడలేదు" అని చెప్పియున్నారు. ఆ మాటను ఎలా అర్థము చేసుకోవాలి?**

**జవాబు :-** ఇది అడగవలసిన ప్రశ్నయే.  సమయోచితముగా  ఈ ప్రశ్నను అడగడము వలన మిగతా వారికి ఉన్న సంశయములు కూడా లేకుండా పోవును.  నీ ప్రశ్నకు జవాబు చాలా అనుమానాలను లేకుండా చేయగలదు. అందువలన  మీకు  అర్థమయ్యే విధముగా  జవాబును చెప్పుటకు ప్రయత్నిస్తాను.  ఒకవేళ ఎక్కడయినా అనుమాన నివృత్తి కాకపోతే  తిరిగి ప్రశ్నను అడగమని చెప్పుచున్నాను.  'దేవుడు, జీవుడు' అను రెండుమాటలు ఆధ్యాత్మికములో  వినిపించుచుండును.  జీవుడు అంటే మొదటి ఆత్మ ఒక్కటేయని చెప్పుకొన్నాము.  దేవుని విషయమునకు వస్తే  అందరూ ఆరాధించవలసినవాడు ఒక్కడే అయినా, ఆ ఒక్క దేవున్ని సృష్ఠించినవాడు మరొకరున్నారని ముందే తెలుసుకొన్నాము.  అందరూ ఆరాధించు దేవుడు రెండవ ఆత్మకాగా,  ఆయనను సృష్ఠించినవాడు ఆత్మకంటే వేరుగాయున్నాడు. ఆత్మను సృష్ఠించినవాడు ఆత్మకంటే వేరుగా యున్నాడు కావున  ఆయనను

పరమాత్మయని అంటున్నాము. పరమాత్మ మూడవ ఆత్మకాగా, జీవాత్మ మొదటివాడు కాగా, ఆత్మ రెండవవాడని ముందే తెలుసుకొన్నాము.

మొదటి ఆత్మ జీవాత్మయని భగవద్గీత పురుషోత్తమప్రాప్తి యోగములో తెలియబడినది. పురుషోత్తమప్రాప్తి యోగము అను అధ్యాయము పదిహేన వది. పదిహేనవ (15) అధ్యాయము వరకు జీవుడు, ఆత్మ, పరమాత్మ అను ముగ్గురినీ ఆత్మయను ఒకే పేరు మీద చెప్పుతూ వచ్చారు. పురుషోత్తమ ప్రాప్తి యోగములో పురుషులు ముగ్గురనీ అందులో ఒకడు నాశనమగు జీవాత్మయనీ, రెండవవాడు నాశనము కాని ఆత్మయనీ, మూడవవాడు జీవాత్మ, ఆత్మ అను ఇద్దరు పురుషులకంటే ఉత్తముడయిన పురుషోత్తము డనీ, పురుషోత్తముడయిన వానినే పరమాత్మయని అంటున్నారని చెప్పారు. ఈ విషయమంతా భగవద్గీత, పురుషోత్తమ ప్రాప్తి యోగములో 16, 17, 18 శ్లోకములలో చెప్పారు క్రింద చూడండి.

16వ.శ్లో॥ ద్వా విమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థో క్షర ఉచ్యతే ॥

**భావము :-** లోకములోన రెండు విధముల పురుషులు గలరు. ఒక రకము పురుషున్ని క్షరుడు అని అంటారు. ఇంకొక రకమైన పురుషున్ని అక్షరుడు అని అంటారు. సర్వజీవరాసులుగా క్షరుడు గలడు. జీవ శరీరములందు క్షరునితో పాటు అక్షరుడు కూడా కలిసి యున్నాడు.

17వ శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥

**భావము :-** క్షరుడు, అక్షరుడు అను ఇద్దరు పురుషులకంటే ఉత్తముడయిన

పురుషుడు అన్యముగా (వేరుగా) ఇంకొకడున్నాడు. ఆ మూడవ పురుషున్ని పరమాత్మయని పిలుస్తున్నాము. అతడు ముల్లోకములను ఆవహించి నాశనము లేని ఈశ్వరుడుగా (అధిపతిగా) యున్నాడు.

18వ శ్లో॥ యస్మాత్ క్షర మతీతో ఽ హ మక్షరాదపి చోత్తమః ।
అతోఽస్మిలోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥

**భావము :-** మూడవ పురుషుడు అక్షరునికంటే శ్రేష్ఠుడు, క్షరునికంటే అతీతుడు అగుట వలన సర్వజ్ఞానములలోనూ ఆయననే పురుషోత్తమునిగా జ్ఞానులు అందరూ చెప్పుచున్నారు.

ప్రకృతి స్త్రీతత్త్వమనీ, దేవుడు పురుషతత్త్వమనీ నేను ముందే చెప్పాను. పరమాత్మ ముగ్గురు పురుషులుగా విభజింపబడినాడని కూడా ముందే చెప్పాము. ముగ్గురు పురుషులను గురించి వారి విభాగముల పేర్ల గురించి 15వ అధ్యాయము పురుషోత్తమ ప్రాప్తి యోగములో చెప్పియున్నారు. క్షరుడు అనగా నాశనమగువాడు, అక్షరుడనగా నాశనము కానివాడు అని అర్థము కలదు. జీవాత్మ నాశనమగువాడనీ, ఆత్మ నాశనము కానివాడనీ ఇద్దరి వరకు శ్లోకములో చెప్పి మూడవవాడయిన పరమాత్మ మొదటి ఇద్దరు పురుషులకంటే ఉత్తముడనీ అందువలన ఆత్మకంటే వేరుగాయున్న పరమాత్మను పురుషోత్తముడని అనుచున్నామని చెప్పారు. మూడవ పురుషుడు కూడా నాశనము లేనివాడయినందున ఆయనను అవ్యయుడు అని కూడా అన్నారు. ఆత్మ, పరమాత్మ ఇద్దరూ నాశనము లేనివారే అయినందున ఇద్దరినీ ఒకే పేరుతో పిలుచుటకు అవకాశమున్నది. అందువలన ఇద్దరినీ దేవుడని ప్రథమ దైవగ్రంథములో చెప్పగా, ఇద్దరినీ అల్లాహ్‌యని అంతిమ దైవగ్రంథములో చెప్పారు. రెండు పేర్లు ఒకటే

అయినందున ఆత్మ, పరమాత్మ ఇద్దరూ ఒకే పేరుతో పిలువబడుట వలన, మనుషులలో చాలామందికి ఎవరు రెండవ దేవుడు, ఎవరు మూడవ దేవుడు అను వివరము తెలియక, ఉన్నది ఒకే దేవుడు కదా!యని అంటున్నారు. అంతిమ దైవ గ్రంథములో మొదటి సృష్ఠికర్తయిన పరమాత్మను అల్లాహ్‌యని చెప్పియున్నారు. అట్లే రెండవ సృష్ఠికర్తయిన ఆత్మను కూడా అల్లాహ్‌యని అన్నారు. అలా ఒకే పేరుతో చెప్పినా ఒకరు పనిచేయని అల్లాహ్‌యనీ, ఒకరు పని చేయు అల్లాహ్‌యనీ గ్రంథములో చెప్పియున్నా, ఆ ఇద్దరి తారతమ్యము (భేదము) తెలియక ఉన్నది ఒకే అల్లాహ్ యని అంటున్నారు. ఇద్దరి అల్లాహ్‌లలో ఒకరు ఆరాధన యోగ్యుడు, మరొకరు ఆరాధన అవసరము లేనివాడని చెప్పియున్నా, మనుషులు గ్రహించలేని స్థితిలో యున్నారు. ప్రథమ దైవ గ్రంథములో క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు అని ముగ్గురి వివరమును పురుషోత్తమ ప్రాప్తి యోగము అను అధ్యాయములో చెప్పియున్నారు. అయినా భగవద్గీతను బోధించు వారికి కూడా ముగ్గురు పురుషుల వివరము తెలియకుండా పోయినది.

సృష్ట్యాదిలో భూమిమీద మొదట జ్ఞానము తెలుసుకొన్నవారు దక్షిణ భారతదేశము వారు. మొట్టమొదట భూమిమీద దైవ జ్ఞానమును తెలిసిన వారు తెలుగు భాష మాట్లాడువారు. ప్రపంచములో మొదట తయారయిన భాష తెలుగు భాష. తెలుగు భాషలోనే మొదట భూమిమీద సూర్యుని చేత జ్ఞానము చెప్పబడినది. ప్రపంచములో మొదటి జ్ఞానులు భారతదేశము వారు. భారతదేశములో తెలుగువారే మొదటి జ్ఞానులు. ఆనాడు ఎంతో జ్ఞానము కల్గిన తెలుగువారు కూడా నేడు భగవద్గీతలో చెప్పిన ముగ్గురు పురుషుల వివరమును తెలియక జీవుడు, దేవుడు అను మాటను చెప్పుచున్నారు తప్ప మూడవవాడు కూడా ఉన్నాడు అని చెప్పలేదు. అదే

విధముగా మేము దేవుని ఎడల పూర్తి విశ్వాసులము అనువారు కూడా అంతిమ దైవ గ్రంథములో ముగ్గురు పురుషులను గురించి  సూరా 50, ఆయత్ 21లో చెప్పియున్నా, ఒకరిని మనిషిగా చెప్పి  మిగతా ఇద్దరిని దేవదూతలుగా వర్ణించుకొన్నారు.  మిగతా ఇద్దరే అల్లాహ్‌లుగా యున్నారని గ్రహించుకోలేకపోయారు.  ఆ ఇద్దరిలో ఒకరు **'సర్వులకు ఆరాధ్య దైవముగా యున్నాడనీ'**, రెండవవాడు **'ఏ అక్కరలేని, ఏ సంతతిలేని అల్లాహ్‌యని'** తెలియలేకపోయారు.  తాము తెలియకపోవడమేకాక ఇతరులు చెప్పినా వినకుండా చెప్పువానిదే అజ్ఞానము, తమదే జ్ఞానము అని అంటున్నారు.

దేవుడు అనగా **'దేవులాడబడువాడు'** అని అర్థము.  దేవుడు వెతకబడే వాడేగానీ తెలియబడేవాడు కాదు.  కావున దేవుడని చెప్పుచున్నాము.  అలాగే అల్లాహ్‌యనగా **'అంతు లేనివాడని'** అర్థము గలదు.  అల్లాహ్ అను పేరు ప్రకారము ఎవరికీ అంతుచిక్కనివాడని చెప్పుచున్నాము.  పేర్లు అర్థములు రెండు బాగున్నాయిగానీ  అల్లాహ్‌లు ఇద్దరనిగానీ,  దేవుడు ఇద్దరిగా ఉన్నాడని గానీ ఖచ్చితముగా చెప్పలేకపోవుచున్నారు.  మనుషుల మెదడుకు దేవున్ని గురించిన సమాచారము గ్రంథములో యున్నా  అర్థము కాకుండా పోయినది.  అంతిమ దైవ గ్రంథములో ఇద్దరి అల్లాహ్‌లను గురించిన వాక్యములు అనేకమున్నాయి.  అయినా అల్లాహ్ ఒక్కడేయను విశ్వాసము తప్ప  దేవుడు ఇద్దరిగా ఉన్నాడుయను జ్ఞానము పూర్తి లేకుండా పోయినది. ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో ఆత్మ, పరమాత్మయని విభజించి ఇద్దరు దేవుళ్లను చెప్పారు.  పురుషోత్తమ ప్రాప్తి యోగమున 17, 18 రెండు శ్లోకములు పూర్తి పరమాత్మను గురించి చెప్పారు.  అట్లే అంతిమ దైవ గ్రంథమున 112వ సూరాలో మొత్తము నాలుగు ఆయత్‌లలో మొదటి

సృష్టికర్త అయిన అల్లాహ్‌ను గురించి చెప్పారు. అట్లే 2-117వ వాక్యములో పెద్ద అల్లాహ్‌ను గురించి ప్రప్రథమముగా సృష్టికర్తయని చెప్పారు. అదే విధముగా 6-102లో మరియు 2-255లో చిన్న అల్లాహ్‌ను గురించి చెప్పియున్నారు. అంతేకాక పనిచేయని అల్లాహ్‌యని పెద్ద అల్లాహ్‌ను, పనిచేయు అల్లాహ్‌యని చిన్న అల్లాహ్‌ను గురించి చెప్పారు. మనుష లందరికీ 'ఆరాధ్య దైవము ఈయన ఒక్కడే'యని మొదటి సృష్టికర్తయిన అల్లాహ్ రెండవ ఆత్మగాయున్న వానిని చూపించాడు. ఇన్ని విధముల చెప్పియున్నా దేవుడు అను పేరులో ఇద్దరున్నారని మనుషులు తెలియ లేకపోవుచున్నారు. తర్వాత కాలములో ముగ్గురి పురుషుల జ్ఞానము కొంతమందికి తెలిసినా, చాలామందికి తెలియకపోవచ్చును.

ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. మొదటి దేవుడు 'నన్ను మ్రొక్కవద్దండి, మీ ఆరాధనలన్నీ రెండవ దేవుడయిన వానికే చేయండియని' చెప్పారు. మూడవ దేవుని విషయానికి వస్తే 'ఆయన ఎవరితోనూ నేరుగా మాట్లాడడు' అని 42వ సూరా 51వ ఆయత్‌లో అంతిమ దైవగ్రంథమందు కూడా చెప్పియున్నారు. మూడవ ఆత్మ అయిన పెద్ద దేవుడు ఎవరితోనూ మాట్లాడడు. ఎవరికీ కనిపించడు. అంతేకాక ఏ పనినీ చేయడు. అందువలన ఆయనను (పెద్ద దేవున్ని) రూప, నామ, క్రియలు లేనివాడని జ్ఞానులయినవారు చెప్పారు. దేవునికి అనగా పరమాత్మయిన మూడవవానికి పేరు లేదు, రూపము లేదు. పేరు ఆకారము రెండు లేని దేవుడు ఏ కార్యములను కూడా చేయడు. ఇంత పెద్ద ప్రపంచములో మనుషులను పుట్టించునది, చంపునది, తిరిగి జన్మకు పంపునది, మనుషులు చేసుకొన్న పాపపుణ్యములకు తీర్పు తీర్చి కష్టసుఖములను నిర్ణయించునది మొదలగు కార్యములను చేయువాడు రెండవ ఆత్మయిన దేవుడు. దేవుడు అను పేరు

ఒకటే రెండవ ఆత్మకు, మూడవ ఆత్మకు ఉన్నా మూడవవాడు ఏమీ చేయడు, రెండవవాడు అన్నీ చేయుచున్నాడు. అందువలన మూడవ ఆత్మయిన మొదటి దేవున్ని గురించి ద్వితీయ దైవగ్రంథమయిన బైబిలులో యోహాను సువార్తయందు ఐదవ అధ్యాయములో 37, 38 వాక్యములలో పెద్ద దేవుడయిన మొదటి సృష్టికర్తను గురించి ఇలా చెప్పారు చూడండి.

**(యోహాన్ 5-37, 38) "మీరు ఏ కాలమందైనను ఆయన స్వరమును వినలేదు. ఆయన స్వరూపమును చూడలేదు. ఆయన ఎవరిని పంపెనో ఆయనను మీరు నమ్మలేదు. కనుక ఆయన వాక్యము మీలో నిలిచి యుండలేదు."**

ఈ వాక్యము క్రైస్థవులుగా యున్న ప్రజలకు ఎంతవరకు అర్థమయి నదో చెప్పలేము. బహుశా నా అంచనాలో ఎవరికీ సరియైన భావములో అర్థమయి ఉండదు. వారి దృష్టి దేవుని వరకు పోయినా అందులో ఏ దేవుడు అను ధ్యాస ఉండదు. అందరి దృష్టిలో ఒకే దేవుడు అను ధ్యాస తప్ప ఇద్దరు దేవుళ్లున్నారని తెలియదు. ఇప్పుడు చెప్పిన పై వాక్యము సర్వప్రపంచమును మొట్టమొదట సృష్టించిన మొదటి సృష్టికర్తయిన మొదటి దేవున్ని గురించి చెప్పారు. దేవుడు అను ఇద్దరిలో పెద్దవాడయిన దేవుడు ఎవరికీ కనిపించువాడు కాదు. ఎందుకనగా! ఆయనకు ఆకారము లేదు. ఆకారము లేనివానిని చూడలేము. ఆయన మాట్లాడడు కావున ఆయన స్వరమును ఎవరూ వినలేదు. అదే రెండవ దేవుని విషయమైతే ఆయనను చూడవచ్చును, ఆయన మాటలను వినవచ్చును. రెండవ దేవుడు మనుష శరీరములో పూర్తి వ్యాపించి యున్నాడు. మనిషి శరీరములో మాట్లాడు చున్నాడు. అందువలన రెండవ దేవుడయినవాని స్వరమును వినవచ్చును.

అట్లే ఆయనను చూడవచ్చును. ఈ విధముగా మొదటి దేవుడు రెండవ దేవుడు తేడాలు కల్గియున్నారు.

మూడు ఆత్మలలో ఒకటి జీవాత్మగా యుండిపోయినది. జీవాత్మ యనగా! కష్టసుఖములను అనుభవించు మనమేయని చెప్పవచ్చును. మూడులో ఒకటి జీవాత్మకాగా, మిగిలిన రెండు ఆత్మలు దేవుడు అని పేరు కల్గియున్నాయి. పెద్ద దేవునికి (మొదటి దేవునికి) రూప, నామ, క్రియలు లేవు. రెండవ దేవుడు అయిన రెండవ ఆత్మ శరీరములో జీవాత్మతో పాటు జీవునికి తోడు ఆత్మగా, జీవునికి పొరుగువానిగా యున్నాడు. శరీరము లోపలి ఆత్మనుగానీ, జీవాత్మనుగానీ ఎవరూ చూచుటకు వీలులేదు. ఆత్మకు ఆత్మయనీ, జీవాత్మకు జీవాత్మయని పేరు ఉన్నా, వారిలో ఆత్మ పని చేయుచుండగా జీవాత్మ జరిగిన పనిలో వచ్చిన కష్టసుఖములను అనుభవించు పనిలో ఉండును. అలా జీవాత్మ, ఆత్మలకు పనియున్నా ఆత్మగానీ, జీవాత్మగానీ ఎదురుగా కనపడువారు కాదు. వారిని స్థూల కన్నులతో ఎవరూ చూడలేరు. వారిని చూచుటకు జ్ఞాననేత్రము అనునది అవసరము. ఈ విషయమై ప్రథమ దైవగ్రంథమున పురుషోత్తమప్రాప్తి యోగములో పదవ శ్లోకమును చూడుము.

10వ శ్లో॥ ఉత్క్రామన్తం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః ॥

**భావము :-** జీవాత్మ గుణములతో కూడి విషయ సుఖములను, కష్టములను అనుభవించుచూ శరీరము లోపలయున్నాడు. అజ్ఞానులైన వారికి జీవుని విషయము తెలియదు. జీవుడు కనిపించడు. జ్ఞాననేత్రులు మాత్రము జీవుని విషయమును చూడగలరు.

ఈ శ్లోకములో జ్ఞానవేత్రము గలవారు మాత్రమే శరీరములో గుణముల మధ్య నివసించు జీవున్ని చూడగలరని చెప్పారు. మనుషులకు నేత్రములు (కన్నులు) రెండు కుడి ఎడమగా ఉన్నాయి. అయితే జ్ఞాన నేత్రమున్నదని చెప్పలేము. జ్ఞానవేత్రము అరుదుగా ఎవరికయినా ఉండ వచ్చును. అయితే ఇంతవరకు ఎవరూ అటువంటి వారు మా దృష్టిలోనికి రాలేదు. జ్ఞాననేత్రము గలవాడు శరీరములోగల జీవాత్మను చూడగలడు. జీవాత్మను చూడగలిగినవానికి శరీరములోని యంత్రాంగమంతయూ తెలియగల్గును. అప్పుడు మూడు ఆత్మలలో తాను జీవాత్మనని తెలియ గల్గును. తన విషయము తెలిసిన తర్వాత తాను వేరు, మిగతా రెండు ఆత్మలు వేరని, మిగతా రెండు ఆత్మలలో మూడవ ఆత్మతో కాకుండా రెండవ ఆత్మతోనే తనకు సంబంధమున్నదనీ, రెండవ ఆత్మయే తనకు దేవుడనీ, రెండవ ఆత్మను తెలియడమే ఆధ్యాత్మికమనీ, రెండవ ఆత్మను తెలియగల్గితే రెండవ ఆత్మ ద్వారా మూడవ ఆత్మయిన పరమాత్మను చేరవచ్చుననీ, పరమాత్మను చేరడమే మోక్షమనీ, మోక్షమును పొందడమే జీవునికి ధ్యేయముగా ఉండాలని తెలియగలడు.

ద్వితీయ దైవగ్రంథములో రెండు ఆజ్ఞలు చెప్పిన మనిషి అయిన ఏసు, రెండవ ఆత్మను కాకుండా మూడవ ఆత్మ అయిన పరమాత్మను ఉద్దేశించి “ఆయన స్వరమును ఎవరూ వినలేదు. ఆయన రూపమును ఎవరూ చూడలేదు” అన్నాడు. మనిషిగా ఉన్న ఎవడుగానీ నిద్రలోగానీ, మెలుకువలోగానీ, స్వప్నములోగానీ ఆయన మాట వినలేదు. ఆయన రూపమును చూడలేదు అన్నాడు. వాక్యములో ‘ఏ కాలమునందయినా’ అని చెప్పినప్పుడు మనిషికి ఉన్న నిద్ర, మెలుకువ, స్వప్నము అను మూడు కాలములలో యని అర్థము. ఇంతవరకు చెప్పిన మూడు ఆత్మల

విషయములో మూడవ ఆత్మయిన పరమాత్మ విషయము నాకు తెలిసినంతలో సంపూర్ణముగా చెప్పాను. జీవాత్మ విషయము కూడా బహుశా సంపూర్ణముగా చెప్పినట్లే యని అనుకొంటున్నాను. ఇకపోతే మధ్య ఆత్మను సంపూర్ణముగా తెలియవలసియున్నది. ఇంతవరకూ చెప్పినది పూర్తి కాలేదు. రెండవ ఆత్మను గురించి తెలియవలసినది, అర్థము చేసుకోవలసినది ఎంతో కలదని అనుకొంటాను. మనకు తెలిసినంతవరకు మనుషులందరికీ దేవుడు రెండవ ఆత్మయే, మనుషులందరూ ఆరాధింపతగిన దేవుడు రెండవవాడే, రహస్యము లయిన జ్ఞానసూత్రములను వివరించి చెప్పువాడు రెండవ ఆత్మయిన దేవుడే. మూడవ ఆత్మయిన దేవుడు (పరమాత్మ) మనుషులకు జ్ఞానమును చెప్పువాడు కాడు. ఆత్మకంటే వేరుగాయున్న పరమాత్మ సాక్షిగా అందరినీ, అన్నిటినీ చూస్తున్నాడుగానీ ఏమి చేయనివాడుగా యున్నాడు. మూడవవాడయిన పరమాత్మ దేవుడను పేరుతో పిలువబడుచున్నా తనను ఎవరు మ్రొక్కినా, ఆరాధించినా, ప్రార్థన చేసినా ఏమాత్రమూ పట్టించుకోడు. మ్రొక్కిన వానిని తనకు మ్రొక్కాడనిగానీ, మ్రొక్కని వానిని తనకు మ్రొక్కలేదని గానీ అనుకోడు. ఎవరితో సంబంధము లేనివాడు, ఏ అక్కరా లేనివాడని ఆయనను గురించి దైవ గ్రంథములలోనే చెప్పియున్నారు. అయితే రెండవ పురుషుడయిన దేవుడు మూడవ పురుషునికంటే అన్ని విధములా భిన్నముగా యున్నాడు.

రెండవ పురుషుడు లేక రెండవ ఆత్మ నాశనము లేనివానిగా యుంటూ అన్ని పనులు చేయు దేవునిగా యున్నాడు. అందరి ప్రార్థనలను ఆలకించువానిగా, అందరి ఆరాధనలను స్వీకరించువానిగా యున్నాడు. అంతేకాక ఆయన అందరి హృదయములలో ఉంటూ అందరినీ చూడగల్గు చున్నాడు. మనిషి పుట్టుక నుండి మరణము వరకు రెండవ పురుషుడే మనిషిని (జీవున్ని) కర్మప్రకారము బాధ్యతగా నడుపుచున్నాడు. అట్లే

చావునుండి తిరిగి మనిషిని పుట్టించుచున్నాడు. చావులో జీవునికి కర్మప్రకారము తీర్పు తీర్చి పాపపుణ్యములను కష్టసుఖములుగా మార్చి పునర్జన్మ కలుగజేయుచున్నాడు. ఈ విధముగా శరీరము లోపలి కార్యములనే చేయుచూ తాను అందరికీ దేవునిగా, అందరికీ ఆరాధ్య దైవముగా యున్నాడు. మొదటి ఆత్మ జీవాత్మకాగా, అతడు నశించే ఆత్మగా, చావుపుట్టుకలు పొందే వానిగా యున్నాడు. రెండవ ఆత్మ ఆధీనములో ఉండి, ఆయన నడిపినట్లు నడుస్తూ, తోలినట్లు పరిగెడుతూ తనమీద విధించిన దానిని అనుభవిస్తూ యున్నాడు. ఈ విధముగా యున్న మొదటి ఆత్మయిన జీవాత్మ కాకుండా, రెండవ ఆత్మయిన ఆరాధ్య దైవము కాకుండా, మూడవ ఆత్మయిన పరమాత్మయు కాకుండా, అందరికీ విభిన్నముగా యున్నవాడు ఆత్మకు, పరమాత్మకు మధ్యలో పుట్టుచున్నాడు. అలా పుట్టువాడు దేవుడు అను పేరుకు సంబంధము లేనివాడుగా ఉంటాడు.

ఆత్మ, పరమాత్మ ఇద్దరూ నాశనము లేనివారే అగుట వలన ఇద్దరూ తెలియబడనివారగుట వలన, వారి ఇద్దరినీ 'దేవుడు' అను పేరుతో పిలుస్తున్నాము. అయితే ఇటు ఆత్మకాక అటు పరమాత్మకాక మధ్యలో దేవుడు అను పేరు లేకుండా పుట్టు పురుషుడు మరొకరు గలరు. అలా పుట్టువాడు కొన్ని వేల సంవత్సరములకో, కొన్ని లక్షల సంవత్సరములకో వచ్చి పుట్టుచుండును. ఆయన మనుషులవలె మనిషి శరీరము ధరించి ఒక జీవిత కాలముండి తర్వాత లేకుండా పోవును. అలా మనిషివలె ఎప్పుడో ఒకప్పుడు పుట్టువాడు చనిపోతే తిరిగి పుట్టడు. అతను మనిషివలె పని చేసినా అతనికి పాపపుణ్య కర్మలు అంటవు. ఇటు దేవుడుకాక అటు మనిషీకాక మనిషివలె కనిపిస్తూ దేవునివలె ప్రవర్తించువాడు మరొకడున్నా డను విషయము బహుశా ఎవరికీ తెలియదనియే చెప్పాలి. అటువంటి

వాడు పుట్టునని దైవ గ్రంథములలో యున్నా మనుషులు దానిని గ్రహించ లేకున్నారు. అటువంటి వాడు ఎప్పుడయినా పుట్టినా అతనిని మనిషివలె లెక్కించి, సాధారణ మనిషి యెడల ప్రవర్తించినట్లే ప్రవర్తించి, అతనిని కూడా బాధించడము, వేధించడము చేయుచుందురు. ఈ విషయమై ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్య యోగమను అధ్యాయములోని పదకొండవ శ్లోకమందు ఇలా చెప్పారు చూడండి.

11వ శ్లో॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్।
పరం భావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్ ॥

**భావము :-** "సర్వ జీవరాసులకు ఈశ్వరుడను (దేవుడను) అయినప్పటికీ మానవ శరీరము ధరించిన నన్ను చూచి, నాలోని శ్రేష్ఠత్వమును తెలియని మనుషులు మూఢజనులై వారి అజ్ఞానముతో, అహముతో నన్ను అవమానించుచున్నారు."

ఈ శ్లోకములో నేను మానవ శరీరము ధరించిన ఈశ్వరున్ని (దేవున్ని) అని చెప్పియున్నారు. అలా ఎప్పుడో ఒకప్పుడు వచ్చిన మానవ దేవున్ని లేక దేవ మానవున్ని మిగతా అజ్ఞాన ప్రజలు సాధారణ మనిషిని చూచినట్లు చూస్తూ, ఆయనలోని దైవత్వమును తెలియని మూర్ఖులై, మనిషిగా వచ్చిన దేవున్ని కూడా అవమానించుచున్నారు అని దైవ గ్రంథమయిన భగవద్గీతలో వ్రాసి యున్నది. అదే విషయము మిగతా రెండు దైవ గ్రంథములలో కూడా కలదు. మిగతా దైవ గ్రంథములలో మరొక విధముగా చెప్పినా అర్థము మాత్రము ఒక్కటే. ఆత్మ, పరమాత్మ మధ్యన మనిషిగా వచ్చినవాడు (దేవుడు) ఎల్లప్పుడూ ఉండువాడు కాదు కనుక ఆయన విషయము ముగ్గురు పురుషులలో చెప్పలేదు. అలా చెప్పకపోయినా

భగవద్గీతలో చెప్పిన శ్లోకమునుబట్టి “నేను దేవుడనైయుండి మనిషిగా పుట్టి వస్తే నా గొప్పతనమును (దైవత్వమును) తెలియనివారు నన్ను అవమానించు చున్నారు అన్నప్పుడు మనిషిగా వచ్చినవాడు దేవుడేయని తెలియుచున్నది. అయితే మనిషిగా వచ్చిన దేవుడు సహజముగా యున్న ఇద్దరి దేవుళ్లలో ఎవరు? అను ప్రశ్నకు జవాబును చూచుకోవాలి. దైవ గ్రంథములలో శాస్త్రాధారముగా ఏమి చెప్పారని, ఇద్దరిలో ఏ దేవుడని వెతికి చూస్తే, ప్రథమ దైవ గ్రంథమందు జ్ఞానయోగమను అధ్యాయమున ఆరవ శ్లోకములో ఇలా చెప్పారు చూడండి.

6వ శ్లో॥ అజోపిసన్నవ్య యాత్మా భూతానా మీశ్వరోపిసన్।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా ॥

**భావము :-** “నాశనములేని వాడనయ్యు పుట్టుకలేని వాడనయ్యు, సకల జీవరాసులకు ఈశ్వరుడనయ్యు (దేవుడనయ్యు) నేను నా ప్రకృతిని చేరి శరీరమును తయారు చేసుకొని మాయతో కూడుకొన్నవాడనై నా ఆత్మ పుట్టుచున్నది.”

ఈ శ్లోక భావమును చూస్తే రెండవ ఆత్మకు సంబంధము లేకుండా మూడవ ఆత్మయిన పరమాత్మయే తన ప్రకృతి చేత శరీరమును తయారు చేసి, అందులో తన ఆత్మనే నింపి భూమిమీదికి పంపాడు అని తెలియు చున్నది. అయితే ఇక్కడ గమనించవలసిన విషయము ఏమనగా! మూడవ ఆత్మయిన పురుషోత్తముడు అంతటా వ్యాపించియుంటూ అవసరము వచ్చినప్పుడు తన ఆత్మనే (మూడవ ఆత్మనే) ప్రకృతి చేత తయారు చేయబడిన శరీరములో నింపి పంపుచున్నాడు. అలా పుట్టినవాడు మూడవ ఆత్మలో అనగా పరమాత్మలో భాగమే కనుక ఆయనను కూడా దేవుడు అని

అనవచ్చును. మూడవ ఆత్మచేత పుట్టింపబడిన వాడు అయినందున మూడవ ఆత్మకు కాస్త తక్కువగా, రెండవ ఆత్మకు కాస్త ఎక్కువగా యున్నాడు. అందువలన మనిషిగా పుట్టినవానిని దేవుడు అని అనకుండా, అట్లని మనిషియని అనకుండా, ప్రత్యేకమైన పేరును పెట్టడము జరిగినది, అతనే **భగవంతుడు.**

ఇటు ఆత్మకు అటు పరమాత్మకు మధ్యలోనున్నవాడయినందున మనిషిగా వచ్చిన భగవంతుడు ఇటు ఆత్మ విషయములను, అటు పరమాత్మ విషయములను తెలిసినవాడై యుండి, ఎప్పుడు ఏ జ్ఞానము అవసరమో అప్పుడు ఆ జ్ఞానమును చెప్పగలడు. శరీరములో శరీరమునకు అధిపతిగా యున్న ఆత్మ కూడా మూడవ ఆత్మను తెలిసినదై యున్నా మనిషి కర్మను బట్టి ప్రవర్తించుచుండును. అందువలన తనకు రెండవ ఆత్మయిన తన విషయము, మూడవ ఆత్మయిన పరమాత్మ విషయము తెలిసినప్పటికీ చెప్పే అవకాశము ఉండదు. అంతేకాక మనిషి చేసుకొన్న కర్మనుబట్టి మనిషిని అజ్ఞానమార్గములో, అధర్మ మార్గములో నడిపించుచుండును. స్వయముగా దేవుడని అనిపించుకొన్న రెండవ ఆత్మ తనకు పరమాత్మ జ్ఞానము దైవ ధర్మములు తెలిసి కూడా మనిషిని అధర్మ మార్గములో, అజ్ఞానముతో నడుచునట్లు చేయుట వలన భూమిమీద మనుషులలో అధర్మములు కూడా అభివృద్ధియగుచున్నవి. ఆత్మవలన భూమిమీద అధర్మముల ప్రవర్తన జరుగుట వలన అధర్మములు చిన్నగా పుంజుకొని బలముగా తయారుకాగా, ధర్మములు తమ ఉనికిని మనుషులలో కోల్పోయి బలహీనమై ఎవరికీ తెలియని స్థితి ఏర్పడుచున్నది. అటువంటప్పుడు ధర్మములకు ముప్పు ఏర్పడకుండా ధర్మములు తిరిగి పుంజుకొనునట్లు చేయుటకు పరమాత్మ తనవద్ద నుండి ప్రత్యేకమైన మనిషిని పంపును. ఆ మనిషిలో మూడవ

ఆత్మ పరమాత్మ ఉండగా, తాను దేవుడుగా యుండి మనిషిగా పుట్టి బలహీనమైన ధర్మములను, గ్లాని ఏర్పడిన ధర్మములను తిరిగి నెలకొల్పుటకు పూనుకొనును. అదే విషయమునే ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీతలో జ్ఞాన యోగమున 7, 8 శ్లోకములందు చెప్పారు చూడండి.

7వ శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత! ।
అభ్యుత్థానమధర్మస్య తదా త్మానం సృజామ్యహమ్॥

**భావము :-** "ఎప్పుడు ధర్మములకు ముప్పుకల్గి భూమిమీద అధర్మములు చెలరేగునో అప్పుడు నన్ను నేను సృజించుకొని మనిషి అవతారములో వచ్చుచున్నాను."

8వ శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥

**భావము :-** "మంచివారిని వృద్ధి చేయుటకు అనగా మనుషులలో జ్ఞానమును పెంచుటకు అజ్ఞానులను లేకుండా చేయుటకు, సకల దైవ ధర్మములను సంస్థాపన చేయుటకు అన్ని యుగములలో మనిషివలె పుట్టుచున్నాను."

ఈ రెండు శ్లోకముల భావములను చూచిన తర్వాత రెండవ ఆత్మ అభివృద్ధి చేసిన అధర్మములను లేకుండా చేయుటకు ప్రజలలో దైవధర్మములను నెలకొల్పుటకు మూడవ ఆత్మయైన పరమాత్మయే స్వయముగా మానవ అవతారములో వస్తున్నాడని తెలియుచున్నది. స్వయముగా పరమాత్మనుండి వచ్చిన మనిషియే భగవంతుడు. భగవంతునిగా వచ్చిన మనుషులు గతములో కొందరున్నారు. అయితే వారు భూమిమీద స్వయముగా మనిషిగా వచ్చినప్పుడు, మిగతా ప్రజలకు దైవ ధర్మములను తెలియజెప్పి జ్ఞానులుగా

చేయుటకు వచ్చినప్పుడు, వారిని సాధారణ మనుషులకంటే హీనముగా చూచినవారు కలరు. వారిని అనేక ఇబ్బందులపాలు చేసి అవమానించిన మూర్ఖులు కూడా కలరు. అందువలననే భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్య యోగమున పదకొండవ (11) శ్లోకమందు తాను దేవుడనయినా మనిషిగా వస్తే నా గొప్పతనము, నా దైవత్వము తెలియనివారు నన్ను అవమానించు చున్నారు అని చెప్పాడు. దేవుడు ఎప్పుడు మనిషిగా వచ్చినా అజ్ఞాన ప్రజలతో ఇబ్బందులు, అవమానములు కలుగుచుండుట వాస్తవమే. అలా మనిషిగా వచ్చిన వాడు (దేవుడు) అవకాశము వచ్చినప్పుడు దైవజ్ఞానమును చెప్పినా దానిని మనుషులు విశ్వసించరు. ఇదే విషయమునే రెండవ దైవగ్రంథములో (బైబిలులో) యోహాన్ సువార్త ఐదవ అధ్యాయము 38వ వాక్యములో కలదు చూడండి.

**(యోహాన్ 5-38) *"ఆయన ఎవరిని పంపెనో ఆయనను మీరు నమ్మలేదు. కనుక మీలో ఆయన వాక్యము నిలిచి యుండలేదు."***

ఈ వాక్యములో పరమాత్మ అయిన మూడవ పురుషుడు ఏసును పంపగా, ఆయన దేవునివద్ద నుండి వచ్చిన దేవుడని నమ్మకపోవడము వలన, ఆయనను (ఏసును) సాధారణ మనిషిగా లెక్కించడము వలన, ఆయన (పరమాత్మ) వాక్యములు మనుషులలో అర్థము కాకుండా పోయాయి. పరమాత్మ పంపినవాడు లేక పరమాత్మ నుండి వచ్చినవాడు అయిన ఏసు కొన్ని సందర్భములలో 'తానే దేవుని'గా చెప్పిన వాక్యములు కూడా కలవు. దీనినిబట్టి మూడవ ఆత్మనుండి వచ్చినవాడు ఒక్కొక్కప్పుడు మూడవ ఆత్మగా, అనగా పరమాత్మగా మాట్లాడిన సందర్భములు కలవు. మనిషిగా వచ్చిన భగవంతుడు మూడవ పురుషుని నుండి వచ్చినవాడు అయినా రెండవ

పురుషున్ని (ఆత్మను), మూడవ ఆత్మను సంపూర్ణముగా తెలిసినవాడుగా యున్నాడు. అంతేకాక తనను సందర్భానుసారము దేవునిగా చెప్పుకొన్నాడు. ఈ విషయము యోహాను సువార్త, 14వ అధ్యాయములో 8, 9, 10 వాక్యములను చూస్తే ఏసు మనిషిగా యున్నా ఆయన వాస్తవముగా ఎవరో తెలియును.

**(యోహాన్ 14-8, 9, 10) అప్పుడు ఫిలిప్ప "ప్రభువా తండ్రిని (దేవున్ని) మాకు కనపరుచుము, మాకు అంతే చాలును"** అని ఆయనతో చెప్పగా! ఏసు **"ఫిలిప్ప నేను ఇంతకాలము మీ వద్ద యుండినను నీవు నన్ను ఎరుగవా? నన్ను చూచినవాడు తండ్రిని చూచి యున్నాడు. కనుక తండ్రిని మాకు కనపరచుమని ఎలా అడుగుచున్నావు? తండ్రియందు నేనును, నా యందు తండ్రియు ఉన్నామని నీవు నమ్ముట లేదా!"**

ఈ మూడు వాక్యములు చెప్పినవాడు మనిషిగా యున్న ఏసు అనగా ఒక వ్యక్తి. ఆ వ్యక్తిని 'దేవున్ని మాకు చూపు' అని ఫిలిప్పు అను మరొక వ్యక్తి అడిగినప్పుడు "నీవు ఇప్పుడు నన్ను చూస్తున్నావు కదా! "నన్ను చూచినవాడు తండ్రిని చూచినవాడుగా యున్నాడు" అని చెప్పాడు. ఆ మాటకు అర్థము తండ్రియైన దేవుడు నేనేయని చెప్పినట్లు అవుతుంది. దీనినిబట్టి మనిషిగా యున్న ఏసు నేనే మూడవ పురుషున్ని, నన్ను నీవు చూస్తున్నావు కదా! దానివలన దేవుడయిన తండ్రిని నీవు చూచినట్లేయని చెప్పాడు. తర్వాత అతనికి (ఫిలిప్పుకు) ప్రశ్న రాకుండా తండ్రి నేను ఒక్కటేయని తండ్రియందు నేను, నాయందు తండ్రి యున్నామని నీవు నమ్ముట లేదా?యని అడిగాడు. ఈ మాటలను బట్టి మూడవ పురుషుని

నుండి పుట్టినవాడు మనిషి అయిన భగవంతుడు. భగవంతునిగా యున్న మనిషికి పరమాత్మ తండ్రిగా యున్నాడు. పరమాత్మ భగవంతుని రూపములో భూమిమీదికి తన జ్ఞానమును చెప్పుటకు వచ్చాడు కనుక పరమాత్మయైన తండ్రి, కుమారుడైన భగవంతుడు ఇద్దరూ కలిసియున్నారు. దానివలన భగవంతుని రూపములో యున్న పరమాత్మయని దేవునివద్ద నుండి వచ్చిన మనిషని చెప్పవచ్చును. పరమాత్మ భగవంతుడు కలిసి యుండుట వలన పైకి చూచుటకు కనిపించే భగవంతునిగా యున్నా లోపల పరమాత్మయే యున్నాడు. అందువలన **"నన్ను చూస్తే నా తండ్రిని చూచినట్లే"** యని ఏసు చెప్పాడు. మనిషిగా వచ్చిన భగవంతుడు ఆత్మను, పరమాత్మను ఇద్దరినీ తెలిసినవాడుగా యున్నాడు. ఈ విషయమంతయూ మనుషులు బాగా యోచిస్తేగానీ అర్థము కాదు. అందువలన జాగ్రత్తగా చదవండి (తినండి), జాగ్రత్తగా గ్రహించండి (త్రాగండి).

మొదటి ఆత్మయిన జీవాత్మకు తండ్రిగా ఆత్మయున్నాడు. అలాగే ఆత్మకు తండ్రిగా పరమాత్మయున్నాడు. జీవాత్మకు పరమాత్మ 'తాత దేవుడు' కాగా, ఆత్మకు పరమాత్మ 'తండ్రి దేవుడు'గా యున్నాడు. జీవాత్మకు ఆత్మ 'తండ్రి దేవుడు'గా యున్నాడు. ఈ వావి వరుసలన్నీ ముందే తెలుసు కొన్నాము. శరీరములోని రెండవ ఆత్మ శరీర పరిధిలోనే పని చేస్తున్నది. అంతేకాక జీవాత్మ కర్మను అనుసరించే రెండవ ఆత్మ పని చేయుట వలన ఆత్మ అవసరమును బట్టి ఒకప్పుడు జ్ఞానిగా, ఒకప్పుడు అజ్ఞానిగా ప్రవర్తించ వలసియుండును. మనుషులు ఎక్కువగా పాపమునే సంపాదించుకొనుట వలన, అజ్ఞాన మార్గములోనే ఎక్కువగా నడువవలసియుండుట వలన, జీవున్ని నడుపువాడు ఆత్మే అయినందున, ఆత్మ జీవున్ని అనుసరించి అజ్ఞానమునే బయటికి చెప్పవలసియుండును. ఆత్మ వలననే అధర్మములు

అభివృద్ధి చెందుచున్నవని చెప్పుకొన్నాము. ఇకపోతే మూడవ ఆత్మ అయిన పరమాత్మ ఉలుకువాడు కాదు, పలుకువాడు కాదు. ఆయన ఏమీ పట్టించు కోని సాక్షిభూతునిగా యున్నాడు. అటువంటప్పుడు భూమిమీద దైవ ధర్మములను తెలియజేసి, మనుషులకు జ్ఞానమార్గమును చూపి, పరమాత్మ యందు ఐక్యము చేయుటకు సాధ్యమైనవాడు ఒక భగవంతుడు తప్ప ఎవరూ లేరు. భగవంతునిగా వచ్చినవాడే మనిషికి జ్ఞానమును చెప్పి సత్యమైన దైవమార్గములో పంపి, చివరకు దేవునియందు చేర్చాలి. మనిషి జ్ఞానము తెలిసి, యోగమార్గమును అనుసరించి చివరికి మోక్షము పొందవలసి యుండును. ఇవన్నియూ భగవంతుని వలననే సాధ్యమగును గనుక మధ్య దైవ గ్రంథమయిన ఇంజీలులో అనగా బైబిలు గ్రంథములో యోహాన్ 14వ అధ్యాయమున ఆరవ వాక్యములో భగవంతునిగా వచ్చినవాడు మనుషుల ఎడల ఎలా ఉన్నాడో చెప్పుచున్నారు గమనించండి.

**(యోహాన్ 14-6) "ఏసు నేనే మార్గమును, సత్యమును, జీవమును. నా ద్వారానే తప్ప ఎవడును తండ్రి యొద్దకు రాడు."**

ఈ వాక్యమును గమనిస్తే ఇందులో అర్థము చేసుకోవలసిన పదములు ఇలా గలవు. 'నేనే మార్గము' అనగా దేవుని యొద్దకు పోవుటకు తగిన జ్ఞానమును నేనేయని చెప్పుచున్నాడు. అనగా భగవంతుడు చెప్పిన జ్ఞానమే మోక్షదాయమయిన పరమాత్మను చేరు మార్గమని తెలియుచున్నది. తర్వాత రెండవ పదము 'నేనే సత్యమును' అని కలదు. జ్ఞానము తెలిసిన తర్వాత దానిని ఆచరించు ఆచరణను యోగము అని అంటాము. యోగము సత్యముతో కూడుకొని యున్నదని చెప్పుచూ 'నేనే సత్యము' అని అన్నాడు. భగవంతుని ద్వారానే ఆచరించు యోగమును తెలియవలసియున్నది కనుక

'నేనే సత్యము'ను అని అన్నాడు. జ్ఞానమును తెలిసి, యోగమును ఆచరించి నప్పుడు మనిషికి యున్న కర్మయంతయూ కాలిపోయి చివరికి జీవుడు కర్మరహితుడై పరలోక రాజ్యమబనడు పరంధామమును చేరుచున్నాడు, అనగా మోక్షమును పొంది పరమాత్మయందు శాశ్వితముగా నిలిచి పోవుచున్నాడు. జీవుడు మనిషిగా ఉన్నప్పుడు మాటిమాటికి మరణమును పొందుచూ తిరిగి క్రొత్త జన్మను పొందుచూ జన్మ జన్మకు బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యమును పొందుచున్నాడు. ప్రతి జన్మలోను మృతుడుగా మిగులుచున్నాడు. మోక్షము పొంది పరమాత్మయను మూడవ పురుషునియందు ఐక్యము అయినవాడు పరమాత్మవలె జనన మరణమును పొందక, నిత్య కర్మలను అనుభవించక ఒకే జీవితమును దేవునియందు కల్గియుండును. భగవంతుడయిన వాని ద్వారానే మనిషి మోక్షమును పొందుచున్నాడు. కావున వాక్యములో 'నేనే జీవము' అని అన్నాడు. నిత్య జీవము అనగా మోక్షమందు దేవునివలె నిత్యము ఒకే విధముగా ఉండుట, దేవునియందు కలిసిపోయి దుఃఖరహిత జీవమును పొందడమును 'నేనే జీవమును' అని అన్నాడు. పై వాక్యము ప్రకారము మనిషిగా వచ్చిన భగవంతుని వలన ఎంత గొప్ప ప్రయోజనమున్నదో తెలియుచున్నది. అయితే భూమిమీద భగవంతునిగా వచ్చిన మనిషి ఎవరు అనునది ఎవరికీ తెలియని సమస్యగా, రహస్యముగా మిగిలిపోవుచున్నది. అరుదుగా దేవుడు మనిషిగా వస్తే ఆయనలోని జ్ఞానమును గ్రహించని మనుషులు ఆయనను తెలియలేరు. ఆయన ద్వారా వచ్చు మోక్షమును పొందలేరు.

పై వాక్యములో నా ద్వారా తప్ప ఎవడూ తండ్రి యొద్దకు రాడు అని యున్నది కదా! దీనిని వివరించుకొని చూస్తే భగవంతునికి తండ్రి పరమాత్మయగును. జీవాత్మ పరమాత్మ వద్దకు చేరాలంటే భగవంతుడు

చెప్పిన జ్ఞానముతోనే సాధ్యమగును. భగవంతుడు తప్ప ఆత్మ, పరమాత్మ ఇద్దరూ జ్ఞానమును చెప్పరు. ఆత్మ శరీర కార్యములను చేస్తూ, చేయిస్తూ తన పనిలో తాను ఉండును. పరమాత్మయిన వాడు ఏమీ బోధించక ఊరకయుండువాడు. జీవాత్మకు ఇటు ఆత్మగానీ, అటు పరమాత్మగానీ ఏమీ బోధించరు. అందువలన జీవుడు మోక్షమును పొందుటకు తగిన జ్ఞానమును ఆత్మ పరమాత్మ ఇవ్వనప్పుడు, పరమాత్మ నుండి వచ్చిన భగవంతుడు మాత్రమే జ్ఞానమును ఇచ్చి మోక్షమును పొందునట్లు చేయుచున్నాడు. అందువలన వాక్యములో 'నా ద్వారా తప్ప ఎవడూ తండ్రి యొద్దకు రాడు' అని యున్నది. ఏసు సాధారణ మనిషిగా యున్నా ఆయన తెల్పిన జ్ఞానమునుబట్టి ఆయనను భగవంతునిగా చెప్పవచ్చును.

ప్రశ్న :- **ఏసు ఆత్మ, పరమాత్మయను ఇద్దరు దేవుళ్లు చేయని పనిని చేస్తూ ధర్మములను బోధించుట వలన ఆయనను భగవంతుడు అని అంటున్నారని చెప్పారు. 'దేవుడు' అను పదమునకు అర్థము ఉన్నది. అట్లే 'పురుషోత్తమ', 'పరమాత్మ' అను పదములకు అర్థమును మీరు చెప్పారు. అదే విధముగా 'భగవంతుడు' అను పదమునకు కూడా ఏదైనా అర్థము కలదా! ఉంటే వివరించి చెప్పండి.**

**జవాబు :-** ఆత్మ అనగా అణిగియున్నదని అర్థము. శరీరములో ఆత్మ అణిగి యున్నది. అందువలన అది ఎవరికీ తెలియదు. జీవాత్మ అనగా శరీరములో అణిగి జీవనము సాగించునది. పరమాత్మయనగా ఆత్మకంటే వేరుగా యున్నదని అర్థము కలదు. అదే విధముగా **'భగవంతుడు అనగా భగమునుండి పుట్టినవాడని'** అర్థము. భగము అనగా తల్లి గర్భము అని చెప్పవచ్చును. గర్భము నుండి పుట్టినవాడు మనిషి యగును. భగమునుండి

పుట్టినవాడు భగవంతుడు అయితే భూమిమీద మనుషులందరూ తల్లి యొక్క గర్భము నుండే పుట్టారు, కావున మనుషులందరూ భగవంతులుగా లెక్కించనగును. అటువంటప్పుడు భగవంతుడు ఒక్కడేయనీ భగవంతుడు భూమిమీద అరుదుగా పుట్టునని చెప్పడము సత్యమా? అను ప్రశ్న రాగలదు. దానికి జవాబు ఏమనగా!

భూమిమీద మనుషులలో ఏ ఒక్కడు కూడా తల్లిగర్భము నుండి పుట్టలేదు. అందువలన ఎవరినీ భగవంతుడు అనుటకు వీలులేదు. మనిషి శరీరము అనగా శిశువుగా యున్న శరీరము తల్లి భగము నుండి పుట్టుచున్నది. అప్పుడు శరీరములో జీవుడు లేడు. శరీరము పుట్టిన తర్వాత జీవుడు శరీరములో చేరుచున్నాడు. ఈ విషయము అందరికీ క్రొత్తగా యున్నా వాస్తవ విషయము అంతే. ఈ విషయము తెలియాలంటే 1980లో వ్రాసిన మా రచనలలోని **"జనన మరణ సిద్ధాంతము"** అను గ్రంథమును చదవండి. జీవుడు చనిపోయిన వెంటనే క్రొత్త శరీరమును ఆశ్రయించుచున్నాడు. క్రొత్త శరీరము అనగా అవయవములన్నీ పూర్తి ఏర్పడిన తర్వాత ప్రసవింపబడి జీవుడు చేరుటకు అనుకూలముగా యున్న దానిని క్రొత్త శరీరము అంటున్నాము. ప్రసవము జరిగిన తర్వాత జీవుడు వచ్చి క్రొత్త శరీరములో చేరుచున్నాడు. తల్లిగర్భము నుండి వచ్చిన శరీరములో జీవుడు లేడు కావున జన్మించిన ప్రతివాడు భగవంతుడు అనుటకు వీలులేదు. మనిషికి (జీవునకు) జననము బయట జరుగుచున్నది గానీ తల్లిగర్భములో కాదు. శాస్త్రబద్ధముగా జీవుడు ప్రసవింపబడిన క్రొత్త శరీరములో చేరుచున్నాడు. సజీవముగా శిశు శరీరముతో ఎవడూ పుట్టడు. అట్లు పుట్టువాడు పరమాత్మ నుండి వచ్చినవాడేయని చెప్పవచ్చును.

పరమాత్మ నుండి వచ్చిన పరమాత్మ అంశ, మరణించి వచ్చినవాడు క్రొత్త శరీరమును చేరినట్లు శిశుశరీరములో చేరడము లేదు. దేవుని అంశ తల్లి కడుపులోని శిశుశరీరములోనే ముందునుండి యుండి సజీవముగా పుట్టుచున్నాడు. దేవుడు అయిన పరమాత్మ భూమిమీద పుట్టి అధర్మములను అణచివేసి, ధర్మములను తిరిగి పునరుద్ధరించుటకు పూనుకొన్నప్పుడు తల్లిగర్భములో ఎప్పుడు తయారగుటకు ప్రారంభించునో అప్పటినుండి ఆ శరీరములో యున్నాడు. అందువలన శరీరముతో పాటు భగవంతుడు వస్తున్నాడు. సాధారణ మనిషివలె భగవంతుడు పుట్టలేదు. సజీవముగా శరీరముతో సహా తల్లిగర్భము నుండి వస్తున్నాడు. కావున భగము నుండి పుట్టినవాడు ఒక్కడే యగును. అలా పుట్టిన ఒక్కడు భగవంతుడని పిలువబడుచున్నాడు. సాధారణ జనులు ఎవరూ తల్లిగర్భము నుండి సజీవముగా పుట్టలేదు. కావున ఎవరినీ భగవంతుడని పిలుచుటకు వీలులేదు. భగవంతుడు పరమాత్మయిన దేవుడుయని చెప్పవచ్చును. పరమాత్మ ప్రపంచమంతా అందరిలోనూ, అందరి బయటా ఉండినప్పటికీ ప్రత్యేకించి భగవంతుని శరీరములో కూడా యున్నాడు. సముద్రములో ఉన్నది నీరు, సముద్రము నుండి ఎగిరి పడిన నీటి బిందువులో కూడా నీరే యున్నది. సముద్రము ఎంత పెద్దదయినా దానిలో ఉన్నది నీరే, అట్లే నీటి బిందువు ఎంత చిన్నదయినా అందులో యున్నది కూడా నీరేయని చెప్పవచ్చును. అదే విధముగా బాహ్యములో వ్యాపించినది పరమాత్మే అట్లే భగవంతుని శరీరములో యున్నది పరమాత్మే. అందువలన భగవంతుడు మనిషి అయినా, ఆయనను దేవుడని కొన్ని సందర్భములలో చెప్పుచున్నాము.

**ప్రశ్న :- భగవంతుడు ఒక్కడే ప్రజలకు జ్ఞానమును చెప్పును తప్ప శరీరములోని ఆత్మ జ్ఞానము చెప్పదుయని మీరు చెప్పారు. మీరు**

**అప్పుడప్పుడు మాట్లాడుచూ నేను గ్రంథమును వ్రాయడము లేదు. నాలోని ఆత్మయే నా చేత వ్రాయించుచున్నదనీ, మీరు వ్రాసిన జ్ఞానమునకు కర్త మీరు కాదని మీలోని ఆత్మయని చెప్పారు. అప్పుడు మీ శరీరములోని ఆత్మ దైవజ్ఞానమును అందించుచున్నది కదా! మీ గ్రంథములలో ఎంతో గొప్ప జ్ఞానము కలదు. ఆ గొప్ప జ్ఞానమును మీ శరీరములోని ఆత్మ చెప్పినట్లే కదా! ఆత్మజ్ఞానమును, పరమాత్మ జ్ఞానమును నీ శరీరములోని ఆత్మ చెప్పినప్పుడే నీవు గ్రంథము వ్రాసినట్లయితే శాస్త్రబద్ధముగా ఆత్మ కూడా జ్ఞానము చెప్పుచున్నదని తెలియుచున్నది. అటువంటప్పుడు ఆత్మ దైవ ధర్మములను బోధించదు అనుట అసత్యమగును కదా! మీరు అసత్యమును చెప్పరని మేము నమ్ముచున్నాము. అయినా ఈ విషయములో మేము ఏమనుకోవాలి? ఎట్లు అర్థము చేసుకోవాలి.**

**జవాబు :-** మిమ్ములను సత్యవంతులను చేయాలను ఉద్దేశ్యముతో నేను సత్యమునే చెప్పుచున్నాను. శరీరములోని ఆత్మ భగవంతునివలె ధర్మ ప్రతిష్ఠాపన చేయదు. ఆత్మ కర్మప్రకారము ప్రపంచ విషయములను నడుపుచుండును. దేవుని విషయములు కర్మ ఆధీనములో ఉండవు. దేవుని జ్ఞానము అంతయూ శ్రద్ధమీద ఆధారపడియుండును, కర్మకు ఏమాత్రమూ సంబంధము ఉండదు. మనిషి శ్రద్ధ దేవుని మీద ఉన్నట్లయితే మనిషి శ్రద్ధను బట్టి ఆత్మ జీవునికి జ్ఞానమును అందించగలదు. జీవుని శ్రద్ధ దైవము మీద లేనప్పుడు అతనికి జ్ఞానమును అందించదు. మనిషి శ్రద్ధ ప్రపంచ విషయములో ఉంటే అతని శ్రద్ధ ప్రకారము అజ్ఞానమునే అందించును. ఆత్మ శరీరములో నియమ నిబద్ధతతో పని చేయుచుండును. జీవాత్మ కర్మనుబట్టి అతనికి కష్టసుఖములను అందించుచుండును. అట్లే

జీవుని అభిరుచిని శ్రద్ధనుబట్టి జ్ఞానమునుగానీ, అజ్ఞానమునుగానీ ఆత్మ అందించుచుండును. నాకు జ్ఞానము మీద శ్రద్ధయుండుట వలన, నా చింతనయంతా దేవుని మీద ఉండుట వలన నా ఆత్మ నాకు ఉత్తమమైన జ్ఞానమును అందించుచున్నది. శరీరములో ఆత్మ అన్ని పనులు చేయుచూ నా వలననే మీకు జ్ఞానముగానీ, ఊహగానీ, అజ్ఞానముగానీ, బుద్ధివంతము గానీ, బుద్ధిహీనతగానీ కలుగుచుండునని చెప్పుచున్నది. ఈ విషయము ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీత, పురుషోత్తమప్రాప్తి యోగమున 15వ శ్లోకములో ఇలా కలదు చూడండి.

15వ శ్లో॥ సర్వస్య చాహం హృదిసన్నివిష్టోమత్తః స్మృతిర్ జ్ఞానమపోహనంచ ।
వేదైశ్చ సర్వైరహ మేవ వేద్యో వేదాన్తకృ ద్వేదవి దేవ చాహమ్ ॥

**భావము :-** సర్వ జీవరాసుల హృదయములలో నేను ఉన్నాను. నా వలననే మనుషులకు స్మృతి, జ్ఞానము, ఊహ కల్గుచుండును. గుణముల ఫలితమును ఇచ్చువాడను నేనే, గుణముల అంత్యములో యున్నవాడను నేనే, గుణములను తెలిసినవాడను నేనే.

ఈ శ్లోకములో జ్ఞానము కల్గును అని చెప్పియున్నారు. మనిషి శ్రద్ధనుబట్టి దైవజ్ఞానమును అందించువాడు ఆత్మే అయినందున ఆ విధముగా చెప్పారు. అంతేకాక ప్రపంచములో పనులు చేయుటకు ఊహను ఇచ్చువాడు కూడా ఆత్మే అయినందున మనిషి ఇష్టమునుబట్టి జ్ఞాన విషయములలో ఆత్మ ప్రవర్తించుచున్నదనీ, ప్రపంచ విషయములలో కర్మనుబట్టి ప్రవర్తించు చున్నదనీ తెలియుచున్నది. నా శ్రద్ధ జ్ఞానము మీద ఉండుట వలన నాకు శరీరములో గల హృదయము (మెదడు) నుండి ఆత్మ అనేక జ్ఞాన విషయములను అందించుట వలన దానినే నేను గ్రంథరూపములో

వ్రాయడము జరిగినది. ఏమాత్రము జ్ఞానము మీద ధ్యాస లేకుండా అధర్మములలో మునిగి, అధర్మాచరణ కల్గినవారికి ఆత్మ వారి ఇష్టమును బట్టి అజ్ఞానమును, అధర్మములను బోధించుచుండును. ఆ విధముగా ఆత్మ వలన అజ్ఞానము కూడా కల్గుచున్నది. శరీరములో ఆత్మ అందించిన అజ్ఞానము వలననే భూమిమీద అధర్మములు పెరిగిపోగా, అధర్మములను అణచివేసి ధర్మములను ప్రచారము చేయుటకు పరమాత్మయే మారువేషముగా భగవంతుని రూపములో భూమిమీదకి వస్తున్నాడు. అలా మూడవ పురుషుడయిన పరమాత్మ భూమిమీదికి రాకపోతే ధర్మములను గురించి చెప్పువారుండరు. ఆత్మ మనిషి ఇష్టమునుబట్టి చెప్పుట వలన, మనుషులు అందరూ అజ్ఞానమార్గమునే ఇష్టపడుట వలన, ఆత్మ కూడా అధర్మములనే బోధించుచుండును. ఎక్కడో అరుదుగా నాలాంటి మనిషి జ్ఞానమును ఇష్టపడినా, ఆత్మ ధర్మములను నాకు బోధించినా, నేను చెప్పు ధర్మములను వినే స్థితిలో ప్రజలు ఉండరు. వారి ఇష్టమునుబట్టి ఆత్మ అజ్ఞానమును బోధించుట వలన నేను చెప్పు జ్ఞానమును వారు ఒప్పుకోరు. నేను చెప్పు జ్ఞానము సరియైనదికాదని ప్రచారము చేయుదురు. ఆత్మ నా ఒక్కనికి జ్ఞానమును చెప్పి, లక్షలమందికి అజ్ఞానము చెప్పడము వలన అజ్ఞానము మాటనే అందరూ సమర్థింతురు. జ్ఞానమువైపు వచ్చువారు అరుదుగా ఉందురు.

**ప్రశ్న :- దేవుడయిన పరమాత్మ భూమిమీద ధర్మప్రతిష్ఠాపనకు భగవంతునిగా వచ్చుననీ, అలా వచ్చినప్పుడు ఆయన జ్ఞానమును విననివారు, తెలియని వారు భగవంతున్ని కూడా అవమానింతురని ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీతలో కలదని చెప్పారు. ఆ విషయము ఇతర దైవ గ్రంథములలో ఎక్కడయినా చెప్పారా? అన్నది మా ప్రశ్న.**

**జవాబు :-** భగవద్గీతలోనే కాకుండా మిగతా రెండు దైవ గ్రంథములలో కూడా చెప్పారు. ద్వితీయ దైవగ్రంథములో యోహాన్ సువార్తలో ఐదవ అధ్యాయమున 38వ వచనములో ఆ మాటను గుర్తించవచ్చును. ఒకమారు ఆ వాక్యమును చూస్తాము.

**(యోహాన్ 5-38) "ఆయన ఎవరిని పంపెనో మీరు ఆయనను నమ్మలేదు కనుక మీలో ఆయన వాక్యము నిలిచియుండలేదు."**

ఇదే విషయమును తెలియజేయు అనేక వాక్యములు బైబిలు గ్రంథములో గలవు. అంతేకాక అంతిమ దైవ గ్రంథమయిన ఖుర్ఆన్ గ్రంథములో సూరా 15, ఆయత్ 28, 29, 30, 31 వాక్యములలోనూ మరియు 89వ సూరా 22వ ఆయత్‌లోనూ **"దేవుడు మనిషిగా అవతరిస్తాడని"** గలదు. అక్కడ వ్రాసిన వాక్యములో ఉన్న విషయమును కొంత శ్రద్ధగా చూస్తే మన బుద్ధికి లోపల యుండే ఆత్మే సరైన జ్ఞానమును అర్థమగునట్లు చేయగలదు. ఇప్పుడు ఖుర్ఆన్‌లోని 15వ సూరాలోని వాక్యములను చూస్తాము.

**(15-28, 29, 30, 31)**

**(28) కుళ్ళి, బాగా ఎండిపోయిన మట్టితో నేను ఒక మానవున్ని సృష్టించబోతున్నాను అని నీ ప్రభువు దూతలతో అన్నాడు.**

**(29) నేను అతనిని పూర్తిగా తయారు చేసి అతనిలో నా ఆత్మను ఊదినప్పుడు మీరంతా అతనిముందు సాష్టాంగపడండి.**

**(30) దేవదూతలందరూ సాష్టాంగపడినారు.**

**(31) ఒక్క ఇబ్లీసు తప్ప సాష్టాంగ పడేవారితో చేరడానికి వాడు నిరాకరించాడు.**

ఈ నాలుగు వాక్యములను సావధానముగా గ్రహించగలిగితే పరమాత్మ మనిషిగా పుట్టడమేకాక, అవమానమును కూడా పొందుచున్నాడని తెలిసింది.

**"ఎండిపోయిన మట్టితో నేను ఒక మనిషిని సృష్ఠించ బోతున్నాను అని నీ ప్రభువు దూతలతో అన్నాడు"** అని కలదు. పరమాత్మ తనలో సంకల్పించుకొంటూనే అది ఆయన దూతలకు తెలిసి పోతుంది. వెంటనే దేవుని సంకల్పమునకు అనుకూలముగా దేవదూతలు నడుచుకొందురు. పరమాత్మ ఏదయినా జరగాలని సంకల్పించుకొంటే దానిని గ్రహించిన దూతలు వెంటనే స్పందించి ఆ పనిని చేయుదురు. అందువలన మొదటి దేవుడయిన పరమాత్మ పని చేయకున్ననూ ఆయన అనుకున్నదేదయినా వెంటనే జరిగిపోవును. దేవుడు అనుకొను ప్రతి విషయము దూతలకు తెలిసిపోవుచుండును. ఈ విషయమై అంతిమ దైవగ్రంథములో సూరా రెండు ఆయత్ 117లో ఇలా కలదు.

**(2-117) "భూమి ఆకాశములను ప్రప్రథమముగా సృష్ఠించిన వాడు ఆయనే. ఆయన ఏ పనినైనా చేయ సంకల్పించుకొన్నప్పుడు దానిని 'అయిపో' అని అంటే చాలు అది అయిపోతుంది."**

ఈ వాక్యములో దేవుని సంకల్పమును దూతలు తెలిసి నెరవేర్చునట్లు కలదు. అలాగే పరమాత్మయిన దేవుడు (15-28) లో "నేను మట్టితో ఒక మనిషిని సృష్ఠించబోతున్నానని" దూతలతో చెప్పాడు. అంతేకాక దేవుడు మనిషిని తయారు చేసి అతనిలోనికి తన ఆత్మనే ఊదినప్పుడు మీరంతా సాష్టాంగపడండి యని పరమాత్మ చెప్పగా, దేవదూతలందరూ సాష్టాంగ నమస్కారము చేశారు. అయితే ఇబ్లీసుతో (మాయతో) కూడుకొన్న

మనుషులు ఆయనకు నమస్కరించలేదు. నమస్కారము చేయకపోవడము ఆయనను గౌరవించనట్లే యగును. అలాగే మాయతో యున్న మనుషులు దేవునినుండి వచ్చిన భగవంతున్ని దేవుడని తెలియక సాధారణ మనిషివలె లెక్కించి, ఇంకా పెద్ద పెద్ద అవమానములు కూడా చేయుదురని భగవద్గీతలో చెప్పియున్నారు. 15వ సూరాలోని నాలుగు వాక్యముల ప్రకారము 'దేవుని ఆత్మతో కూడిన మనిషి భూమిమీదికి వచ్చునని' తెలియుచున్నది. దీని ప్రకారము 'దేవుడు భూమిమీద అవతరించునని' ఖుర్ఆన్ గ్రంథములో కూడా నిర్ధారించబడినది. అయితే దైవ గ్రంథములో చెప్పిన విషయములు సరిగా అర్థము చేసుకోలేక, దేవుడు చెప్పిన జ్ఞానమును వేరు విధముగా కొందరు, వ్యతిరేఖముగా కొందరు అర్థము చేసుకొంటున్నారు. 'దేవుడు అవతరించును' అను దైవ సందేశమును కొందరు అర్థము చేసుకోలేక దేవుడు అవతరించువాడు కాదుయని, అవతరించును అనుమాట అసత్యము యని అంటున్నారు.

నాకు తెలిసినంత వరకు దేవుడు రెండు యుగములలో, రెండు అవతారములుగా పుట్టాడని అనుకొంటున్నాను. ఇంతవరకు ద్వితీయ దైవ గ్రంథములో జ్ఞానమును బోధించిన ఏసు దేవుని అవతారముగా గుర్తించగలిగాను. ఇది కలియుగములోని మాట. ద్వాపరయుగములోని సమాచారములోనికి పోతే ప్రథమ దైవ గ్రంథమును అర్జునునికి బోధించిన కృష్ణుడు దేవుని అవతారమేయని చెప్పుచున్నాను. భగవద్గీతను చెప్పిన కృష్ణుడు తన బోధలో **"నేనే దేవున్ని"** అని చెప్పడమేకాక తాను భూమి మీదికి ధర్మప్రతిష్ఠాపనకు వచ్చానని కూడా చెప్పాడు. ద్వాపరయుగములో వచ్చిన భగవంతుడు శ్రీకృష్ణుడు. అట్లే కలియుగములో వచ్చిన భగవంతుడు ఏసు అని స్పష్టముగా తెలియుచున్నది. అయితే మనుషులు మతముల

మధ్యలో చిక్కుకొని హిందువులుగా యున్నవారు ఏసును ఒప్పుకోరు. క్రైస్థవులుగా యున్నవారు శ్రీకృష్ణున్ని ఒప్పుకోరు. ఒకరు ఒప్పుకొన్నా ఒప్పుకోకపోయినా సత్యము సత్యముగానే యుండునుగానీ ఇతరులు ఒప్పుకోలేదని సత్యము అసత్యముగా మారదు. ఎవరు ఒప్పుకొనినా ఒప్పుకోకపోయినా కృష్ణుడు, ఏసు ఇద్దరూ భగవంతునిగా వచ్చినవారే. శ్రీకృష్ణుడు అనునది మనుషులు గుర్తించు పేరుగా యున్నది. అయితే కృష్ణుడు అను పేరుతో యున్న శరీరము సాధారణ మనిషిది కాదు అది భగవంతుని శరీరముయని తెలియాలి. భగవంతునిది గానీ, సాధారణ మనిషిదిగానీ శరీరము రెండూ ఒకే విధముగా యుండి, ఒకే విధముగా మరణించి, ఒకే విధముగా నశించును. అయితే భగవంతుని శరీరములో యున్నది మూడవ పురుషుడయిన పరమాత్మయేనని తెలియవలెను. కృష్ణుని శరీరములో పరమాత్మయే ఉన్నాడు. అట్లే కలియుగములో వచ్చిన ఏసు శరీరములో కూడా పరమాత్మయే ఉన్నాడు. ఒకే పరమాత్మ ఇద్దరి శరీరములలో ఉన్నాడు కాబట్టి ద్వాపరయుగములో కృష్ణునిగా వచ్చినవాడు, కలియుగములో ఏసుగా వచ్చినవాడు ఇద్దరూ ఒక్కరేయని చెప్పవచ్చును. దానివలన కృష్ణునిగా యున్నవాడే కలియుగములో ఏసుగా వచ్చాడని చెప్పవచ్చును. తర్వాత ఎప్పుడయినా దేవుడు భగవంతునిగా భూమిమీదికి వస్తే మొదటి కృష్ణుడే, తర్వాత తర్వాత ఎన్నిమార్లయినా వచ్చును. దీనినిబట్టి కృష్ణునిగా వచ్చినవాడే ఏసుగా, ఏసుగా వచ్చినవాడే తర్వాత ఆదరణకర్తగా వచ్చునని తెలియుచున్నది. భగవంతుని రూపములు ఎన్ని మారినా, భగవంతుని పేర్లు ఎన్నియున్నా భగవంతుడుగా వచ్చేవాడు ఒక్కడే.

కృష్ణునిగా వచ్చినప్పుడు బోధించినవాడే ఏసుగా వచ్చినప్పుడు కూడా బోధించాడు. మొదట బోధించినవాడే రెండవమారు బోధించుట వలన

మొదట చెప్పిన బోధనే రెండవమారు కూడా చెప్పియున్నాడు. అయితే భాష మార్పు వలన, వ్రాత తేడా వలన ఇరువురు చెప్పిన బోధలో ఎక్కడయినా కొంత తేడా కనిపించినా రెండు బోధలు ఒక్కటిగానే ఉండును. మనుషులలో యున్న మతము వలన కృష్ణుడును, ఏసును వేరు వేరు మతస్థులుగా కొందరు చూస్తున్నారు. అట్లే వారు చెప్పిన బోధలు వేరు వేరుగా యున్నట్లు భ్రమించు చున్నారు. మతములను వదలి జ్ఞాన దృష్ఠితో చూస్తే భగవంతులు ఇద్దరూ ఒక్కటే, ఇద్దరి బోధ ఒక్కటేయని తెలియుచున్నది. కృష్ణుడు చెప్పిన ప్రథమ దైవగ్రంథములోనూ, ఏసు చెప్పిన ద్వితీయ దైవగ్రంథములోనూ గల జ్ఞానము కొన్నిచోట్ల ఒకే పోలికతో కనిపించుచున్నది. అంతేకాక కృష్ణుడు మరణించు నప్పుడు తాను తిరిగి కొంత కాలమునకు ఏసుగా వస్తానని చెప్పినట్లు **"శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!"** అను గ్రంథములో **'శ్రీకృష్ణుని మరణము లోకమునకు కనువిప్పు'** అను వ్యాసములో శాస్త్రాధారముగా ఆ రోజు జరిగిన సంఘటనను వ్రాసియుంచాము. ఏది ఏమయినా కృష్ణుడు, ఏసు ఇద్దరూ భగవంతులేయని తేలిపోయినది.

కృష్ణుడు శరీరము ధరించి వచ్చినప్పుడు జీవాత్మ, ఆత్మ, పరమాత్మల జ్ఞానమును చెప్పాడు. అట్లే ఏసు భగవంతునిగా వచ్చినప్పుడు కుమారుడు, తండ్రి, పరిశుద్ధాత్మయని మూడు ఆత్మల జ్ఞానమును చెప్పాడు. భగవద్గీతలో యున్న మూలమైన బోధ జీవాత్మ, ఆత్మ, పరమాత్మల చుట్టూయున్నది. అట్లే ఇంజీలు (బైబిలు) లో యున్న మూలమైన బోధ కుమారుడు, తండ్రి, పరిశుద్ధాత్మల చుట్టు తిరుగుచున్నది. జ్ఞానమంతయూ ముగ్గురుని గురించి చెప్పినది తప్ప వేరు లేదు. మూడు దైవ గ్రంథములలో చివరకు మోక్షము లేక పరలోకమను దానిని గురించి చెప్పినదే గలదు. మానవులందరి చివరి గమ్యము మోక్షమేయగుట వలన అందరికీ మూడు దైవ గ్రంథముల సారాంశము అవసరము.

ప్రశ్న :- భూమిమీద భగవంతుడుగా దేవుడే వచ్చినప్పుడు దేవున్ని మనుషులు అవమానించగలరా? ఒకవేళ అవమానించినా దేవుడే భగవంతునిగా యుండుట వలన, భగవంతుడు మనిషిగాయున్నా, మనిషి లోపలయుండు దేవుడు అవమానించిన వారిని వెంటనే శపించడముగానీ, ఇంకా ఏమయినా వారు అనుభవించునట్లు చేయడముగానీ ఉండదా? సాధారణ మనుషులు అవమానించినప్పుడు ప్రత్యేకమైన మనిషిగా వచ్చిన దేవుడు ఎందుకు ఊరకుండాలి? ఏసును చాలామంది అవమానించడమే కాక బాధించడము, చివరకు హింసించి చంపడము జరిగినది. శ్రీకృష్ణుడుగా వచ్చినప్పుడు కూడా అవమానింపబడడమేకాక చివరికి మధురను వదలి దొంగదారిలో ఉత్తరప్రదేశ్ నుండి గుజరాత్‌కు పారిపోవడము జరిగినది. గుజరాత్ రాష్ట్రములో సముద్రము ఒడ్డున ద్వారకానగరమును నిర్మించుకోవడము జరిగినది. దీనిని అంతటిని చూచిన తర్వాత మీరు చెప్పినట్లు భగవంతుని శరీరములో దేవుడున్నాడా? యని అనుమానము కల్గుచున్నది. మీరు చెప్పేది యంతా వినేదానికి బాగానే ఉన్నది. అయితే యదార్థముగా జరిగే సంఘటనలను చూచిన తర్వాత మీరు చెప్పడములో ఏదో లోపము యున్నట్లు కనిపించుచున్నది. దేవుడులో పరమాత్మ అయిన పెద్ద దేవుడు భగవంతుని శరీరములో ఉంటే ఆపద వచ్చినప్పుడు ఆయన అనుకొంటే ఏమయినా జరుగును కదా! తన దూతల చేత ప్రళయమునే సృష్ఠించగల స్థోమతగల దేవుడు తనను కట్టివేసి, ములుకులు కొట్టితే భరించుకోవలసిన అవసరము ఏమి వచ్చినది. ఆయన ఇంకా కొంతకాలముండి ప్రజలకు జ్ఞానము చెప్పవచ్చును కదా! మూడు సంవత్సరములు జ్ఞానమును చెప్పినవాడు అంత తొందరగా ఎందుకు చనిపోవాలి? దీనినిబట్టి ఆయనను (ఏసును) శిలువ వేసినప్పుడు అతనిలో దేవుడు లేకుండా పోయి ఉండునని మేము

**అనుకొంటున్నాము. భగవంతుని శరీరములో దేవుడు కొంత కాలముండి, కొంత కాలము లేకుండా పోవునని మేము అనుకొంటున్నాము. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** భగవంతుని గురించి నేను చెప్పినదానికంటే మీరు పరిశీలనగా చూచినదే ఎక్కువగా యున్నది. మీ ప్రశ్నలో సత్యమున్నదని ఒప్పుకోక తప్పదు. 'దేవుడు అవమానమును మనుషుల చేత పొందుచున్నానని' భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్యమను అధ్యాయమున 11వ శ్లోకములో చెప్పియున్నారు. **'సర్వ జీవరాసులకు మహేశ్వరుడనయ్యు నా గొప్ప తనమును తెలియని మనుషులు నన్ను అవమానించుచున్నారని'** కృష్ణుని రూపములో చెప్పాడు. అలా ఎందుకు జరుగుచున్నదని యోచిస్తే ఆత్మయిన దేవుడు నాలో ఈ విధముగా జ్ఞానమును అందించుచున్నాడు. భగవంతుని శరీరములో పరమాత్మ ప్రవేశించియుండుట వలన ఆయనను దేవుడు అనుటలో సంశయము లేదు. ముఖ్యముగా గమనించవలసినది ఏమనగా! 'దేవుడు మనిషి శరీరములో యున్నా ఆయనను ఎవరూ గ్రహించకూడదను నది దేవుని నియమము.' అంతేకాక ప్రకృతి నియమము ప్రకారము ఒక శరీరము కదలుచున్నదంటే దానిలో ఆత్మయుండి కదలించుచున్నదని తెలియుచున్నది. పరమాత్మ మొదట తల్లిగర్భములోనే శరీరములో ఉన్నాడు. పరమాత్మ ధర్మము ప్రకారము ఏ పనినీ చేయనివాడుగా శరీరములో సాక్షిగా యున్నాడు. శరీరములో లోపలి పని, బయట పని చేయుటకు ఆత్మ తప్పనిసరిగా ఉండాలి. ఆత్మ ఎక్కడుండునో జోడు ఆత్మగా జీవుడుండాలి. ఆ పద్ధతి ప్రకారము దేవుని శరీరమయిన భగవంతునిలో కూడా పరమాత్మతో పాటు ఆత్మ, జీవాత్మ కలవు. అలా మూడు ఆత్మలుండుట వలన సాధారణ మనిషిలో మూడు ఆత్మలున్నట్లు భగవంతుని శరీరములో

కూడా కలరు. భగవంతుని శరీరములో కూడా ఆత్మ పని ఆత్మ, జీవాత్మ పని జీవాత్మ చేయుచున్నారు.

భగవంతుని శరీరములో మొదట ప్రవేశించినది పరమాత్మ కదా! అటువంటప్పుడు భగవంతునిలోనికి ఆత్మ, జీవాత్మ ఎక్కడినుండి వచ్చారు? ఏదో ఒక శరీరములో చనిపోయిన ఆత్మ, జీవాత్మలను జోడు ఆత్మలు వచ్చి చేరియుండవచ్చును కదా!యను ప్రశ్న రావచ్చును? దానికి వాస్తవమైన జవాబును చూస్తే ఇతర జీవుడు, ఆత్మ వచ్చి చేరితే అది మనిషి జన్మ యగును గానీ, పరమాత్మ జన్మ కాదు. అనగా భగవంతుని జన్మ కాదని చెప్పవచ్చును. అటువంటప్పుడు పరమాత్మయే తననుండి ఆత్మను, జీవాత్మను సృష్ట్యాదిలో విడదీసినట్లు విడదీసి, భగవంతుని శరీరములో తనతోపాటు ఉంచుకొన్నాడు. అప్పుడు వేరే శరీరమును వదలి వచ్చిన ఆత్మ, జీవాత్మ కాకుండా భగవంతుని శరీరములో ప్రత్యేకమైన ఆత్మ, ప్రత్యేకమైన జీవాత్మ ఉండడము జరుగుచున్నది. జీవాత్మ ఎప్పుడుందో అప్పుడు జీవాత్మతో పాటు 24 ప్రకృతికి సంబంధించిన శరీర భాగములున్నవి. అందువలన భగవంతుడు సాధారణ మనిషివలె కనిపించును. ఎటు చూచినా ఆయనలో ఆయనను గుర్తించుటకు తగిన ఏ ప్రత్యేకత కనిపించదు. సాధారణ జీవుడు జీవించునట్లు కనిపించు భగవంతుని శరీరములో జీవునికి అనుబంధమైన ముఖ్యమైన కర్మయుండాలి. కర్మ యున్నప్పుడే ఆత్మ మనిషిని కష్ట సుఖములను అనుభవించునట్లు చేయుచుండును. ఆత్మ కర్మప్రకారము ప్రవర్తించుటకు భగవంతుని శరీరములో కర్మలేదు కదా!యని ఎవరయినా అడుగవచ్చును. దానికి జవాబు ఏమనగా!

పరమాత్మ ప్రత్యేకమైన మనిషిగా భగవంతున్ని సృష్టించాలను కొన్నప్పుడే ఒక ఫతకమును తయారు చేసుకొని, దానికి సరిపడునట్లు

కర్మను కూడా సృష్ఠించి, భగవంతుని శరీరములో ఉంచుటవలన భగవంతునికి కర్మను అనుసరించి కష్టసుఖములు, లాభనష్టములు, గౌరవ, అవమానములు సంభవించుచుండును. కృష్ణునిగా వచ్చినప్పుడు అప్పుడు కర్మను అనుసరించి ఆయనకు జరిగియుండును. ఏసుగా వచ్చినప్పుడు ఆయన శరీరములో నిర్మించిన కర్మనుబట్టి అతనికి జరిగినది. భగవంతుడు ఎప్పుడు వచ్చినా ఒక్కడుగానే యుండును. అప్పుడు ఒకరు ఇప్పుడు ఒకరు ఉండరు. పరమాత్మ భగవంతునిగా ఎన్నోమార్లు వచ్చియున్నాడు. ఎప్పుడు వచ్చినది, ఎలా వచ్చినది, ఏ పేరుతో వచ్చినది మనకు తెలియదు. అయితే భగవంతునికి అన్ని జన్మలు జ్ఞాపకముండును. ద్వాపర యుగములో కృష్ణునికంటే ముందు ఎన్నో భగవంతుని జన్మలు కల్గినవి. అన్ని జన్మలు భగవంతునికి జ్ఞాపకముండును. ఎందుకనగా! భగవంతుని శరీరములో ఒకమారు తయారు చేసి ఉంచబడిన జీవుడు, ఆత్మ మొదలుకొని అంతరంగ ములయిన మనస్సు, బుద్ధి, చిత్తము అన్ని అట్లే యుండి భగవంతుడు ఎన్నిమార్లు భూమిమీదికి వచ్చినా అదే జీవుడు, అదే ఆత్మ, అదే మనస్సు ఉండును. అన్ని భగవంతుని జన్మలలోను ఒకే మనస్సు యుండుట వలన భగవంతునికి జరిగిన జన్మలన్నీ జ్ఞాపకముండును. అందువలన భగవద్గీతను అర్జునునికి బోధించినప్పుడు నాకు ఎన్నో జన్మలు కలిగాయి, నీకు ఎన్నో జన్మలు కలిగాయియని చెప్పాడు.

ఈ విషయము భగవద్గీత జ్ఞానయోగమను అధ్యాయమందు ఐదవ శ్లోకమున కలదు చూడండి.

5వ శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి నత్వం వేత్థ పరంతప! ॥

**భావము :-** ఓ అర్జునా! నాకు ఎన్నో జన్మలు కలిగాయి, అట్లే నీకూ ఎన్నో జన్మలు కలిగాయి. నాకు కల్గిన జన్మలన్నీ నాకు జ్ఞాపకమున్నాయి. నాకు కల్గిన జన్మలన్నీ ముందు వెనుక వరుసతో సహా నాకు తెలుసు. అయితే నీకు కల్గిన జన్మలు ఒక్కటి కూడా నీకు జ్ఞప్తికి లేవు.

ఈ శ్లోకములో దేవుడయిన పరమాత్మ మనిషి రూపమైన భగవంతునిగా జన్మించినప్పుడు ఆయన ఎప్పుడు ఏ జన్మ ఎత్తినది అన్నీ ఆయనకు తెలుసు. ఎందుకనగా! ఆయనకు కల్గిన భగవంతుని జన్మలన్నిటి లోనూ ఒకే మనస్సు ఉండుట చేత, మనస్సు మననము చేయునది అగుట చేత, అన్ని జ్ఞాపకములు మనస్సుకు ఉండుట చేత, ఏ యుగములో ఎక్కడ ఏ జన్మ ఎత్తినది భగవంతునిగా వచ్చిన శ్రీకృష్ణునకు జ్ఞాపకముండుట చేత అర్జునునితో నా జన్మలన్నీ నాకు జ్ఞాపకమున్నాయి, నీవు ఎన్నో జన్మలు ఎత్తినా ఒక్కటి కూడా జ్ఞాపకము లేదు అని అన్నాడు. సాధారణ మనిషికి ఒక జన్మలో యున్న మనస్సు రెండవ జన్మకు రాదు. ఏ జన్మలోని మనస్సు ఆ జన్మలోనే నశించుచున్నది, కనుక ఒక జన్మలోని జ్ఞాపకములు తర్వాత జన్మకు తెలియవు. తర్వాత జన్మలో క్రొత్త మనస్సు వచ్చియుండును. ఇట్లు ఏ జన్మది ఆ జన్మకే ఉండుట వలన మనిషికి వెనుకటి జన్మల జ్ఞాపకముండదు. అందువలన నా జన్మలు వరుసగా నాకు జ్ఞాపకము ఉన్నాయి. నీకు వెనుకటి జన్మ జ్ఞాపకము కూడా లేదుయని అన్నాడు.

మూడవ పురుషుడయిన పరమాత్మ ప్రతి యుగములోనూ ధర్మ సంస్థాపనకు వస్తానని ప్రథమ దైవ గ్రంథములో జ్ఞానయోగమున చెప్పి యున్నాడు. దీనినిబట్టి ఆయన కృతయుగము, త్రేతాయుగములో కూడా వచ్చి యుండును. ఎప్పుడు వచ్చినా భగవంతున్ని ఎవరూ గుర్తుపట్టుటకు వీలుండదు. ఎందుకనగా! భగవంతుడు సాధారణ మనిషిగా ఉంటూ,

సాధారణ మనిషి బాధలు, కష్టములు అనుభవించినట్లు అనుభవించు చుండుట వలన ఎవరూ గుర్తించలేరు. ప్రతి జన్మ వేరువేరు కర్మలతో ఒక జన్మకు మరొక జన్మకు పోలిక లేకుండా కర్మయుండుట వలన ఆయన ముందు జన్మలకు, వెనుక జన్మలకు ఏమాత్రము పోలిక లేకుండుట వలన ఆయనను ఈ జన్మలో ఉన్నాడని చెప్పుటకు సాధ్యపడదు. ప్రపంచ సంబంధముగా భగవంతున్ని కనుగొనుట దుస్సాధ్యము. అయితే భగవంతున్ని గుర్తించుటకు ఒకే ఒక అవకాశము గలదు. అది ఏమనగా! భగవంతుడు భూమిమీదికి రావడానికి ముఖ్య కారణమ **'అణగిపోయిన ధర్మములను తిరిగి నెలకొల్పుటకు'** అని అందరికీ తెలుసు. అందువలన ఎక్కడయితే దైవ ధర్మములు బోధించబడుచున్నవో, ఎక్కడయితే మనిషికి తెలియని జ్ఞాన రహస్యములు తెలియుచున్నవో, ఏ శరీరము నుండి ఎవరికీ అర్థముగానీ, సంచలమైన జ్ఞానము బోధింపబడుచున్నదో ఆ శరీరమును ధరించినవాడే భగవంతుడు అని తెలియవచ్చును.

భగవంతునిగా యున్న దేవుడు ప్రపంచ సంబంధముగా ఆయనే కల్పించుకొని, ఏర్పరచుకొని వచ్చిన కర్మప్రకారము ఎలాగయినా ప్రవర్తించు చుండవచ్చును. ఎన్ని కష్టములయినా అనుభవించుచుండవచ్చును, అలాగే ఎన్ని భోగభాగ్యములయినా అనుభవించుచుండవచ్చును. దేవుడయిన భగవంతుడు తనను ప్రజలు గుర్తించనట్లు, తన కర్మను మలచుకొని వచ్చి యుండును. అందువలన ఆయన ప్రపంచ సంబంధముగా చెడ్డవానిగా అయినా కనిపించును లేక మంచివానిగా అయినా కనిపించును. పూర్తి అజ్ఞానిగా ప్రవర్తించుచుండవచ్చును. హంతకుడుగా కనిపించవచ్చును. కర్మ ఎన్ని రకములుంటే అన్ని రకములుగా చెడువానిగానే కనిపించును. అలా చెడుగా ప్రచారమయినవాడు ఎంత జ్ఞానబోధను చెప్పినా అతనిని

జ్ఞానియని కూడా ఎవరూ అనుకోరు. భగవంతున్ని జ్ఞాని అనుకోకుండా ఉండుటకు అతను చేసిన ప్రపంచ కార్యములే కారణము. భగవంతుడు కొద్దిగా చెడు చేసినా, చెడుగా కనిపించినా అతనిని పూర్తి చెడువానిగా ప్రజలు ప్రచారము చేయుట వలన భగవంతుడు అజ్ఞానిగా, దుర్మార్గునిగా గుర్తింపు పొందియుండును. అలా ప్రచారమయిన వానిని ఎవరూ భగవంతునిగా గుర్తించలేరు. ఉదాహరణకు కలియుగములో వచ్చిన ఏసును తీసుకొని చూస్తే ఆయన ఎవరికీ ఏ చెడు చేయకున్నా ఆయనను చెడ్డవానిగా లెక్కించి శిలువ వేయించి చంపించారు. చెడు చేయకున్నా చెడ్డవానిగా ప్రచారము చేయు ప్రజలు అదే పనిగా కొంత చెడు చేస్తే అతనిని పూర్తి చెడ్డవానిగా ప్రచారము చేయుదురు తప్ప అతనిలోని జ్ఞానమును గుర్తించరు. జ్ఞానమును గుర్తించనప్పుడు భగవంతున్ని ఎవరూ కనుకొనలేరు. అందువలన 'భగవంతుడు భూమిమీదికి వస్తే ఆయనను కనుగొనుట దుస్సాధ్యమని' చెప్పాము. త్రేతాయుగములో రావణబ్రహ్మ ఉండేవాడని అతను సీతాదేవిని దొంగగా ఎత్తుకొని పోయి తన రాజ్యములో పెట్టుకొన్నాడని ప్రచారమయినది. అప్పుడు ఆయనను గురించి ఎందుకు సీతను తీసుకపోయాడని కొద్దిమాత్రము కూడా ఎవరూ ఆలోచించక చెడును ఆయనకు అంటగట్టి రావణబ్రహ్మ అంటే దుర్మార్గుడు అని అందరూ అనుకోవడము జరుగుచున్నది. అయితే నేడు రావణబ్రహ్మ 'భగవంతుడు' అని మేము చెప్పితే ఎవరూ నమ్మకపోగా నన్ను కూడా చెడువానిగా లెక్కింతురు. అటువంటి మనస్తత్వమున్న ప్రజల దగ్గరికి నిజముగా భగవంతుడు వచ్చి నేనే భగవంతున్ని అని చెప్పినా! ఎవరూ నమ్మరు. అంతగా ఎవరికీ తెలియకుండా, ఎవరికీ గుర్తింపు పొందకుండా వచ్చిన భగవంతున్ని తెలియుట సాధ్యమయ్యే పనికాదు. ఒకవేళ ఎవరయినా ప్రపంచ విషయములన్నీ ప్రక్కన పెట్టి జ్ఞానమును బోధించు, ధర్మములను

స్థాపించు వ్యక్తిని భగవంతుడని గుర్తించగలిగితే, అతడు ఏ యోగము చేయకుండినా అతని పాపమంతయూ (కర్మంతయూ) క్షమించబడి మోక్షము పొందును. ఈ విషయమును ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీతలో జ్ఞానయోగమను అధ్యాయమున తొమ్మిదవ శ్లోకములో చెప్పారు.

9వ శ్లో॥ జన్మ కర్మచ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మనైతి మామేతి సోర్జున! ॥

**భావము :-** మనిషి ఎవరయినా నా కర్మలను, జన్మమును గ్రహించిన జనుడు మరణించిన తర్వాత వేరు జన్మకు పోడు. అతను దేవుడయిన భగవంతున్ని గుర్తించగలుగుట వలన మోక్షమును పొందగలడు.

ఈ శ్లోకములోని భావమును చూస్తే మోక్షమును సులభముగా పొందవచ్చునను ఆశ ఎవరికయినా కలుగవచ్చును. అట్లు భగవంతున్ని ఎవరయినా గుర్తించారాయంటే మూడు యుగముల కాలములో ఒకే ఒక భీష్ముడు తప్ప ఎవరూ ఇతనే భగవంతుడని గుర్తించలేదు. చాలామందికి నేటికిని దేవునికి, భగవంతునికి తేడా తెలియనివారు గలరు. 'నిరాకారుడు దేవుడని, భగవంతుడు సాకారుడని' తెలియని బోధకులు కూడా కలరు. నేడు ఎందరో స్వామీజీలు దేవుడని చెప్పుచోట భగవంతుడని, భగవంతుడని చెప్పుచోట దేవుడని చెప్పుచున్నారు. దేవుడు భగవంతునిగా వస్తే, భగవంతున్ని ఎవరూ గుర్తించకుండుటకు మనిషివలె కష్టములు, మనిషివలె అవమానములు పొందుచుండుట వలన, ఆయనను చూచినవారు ఎవరూ ఇతనే భగవంతుడని గుర్తించలేరు. గుర్తించుటకు దుస్సాధ్యమైన భగవంతున్ని గుర్తించి, ఆయన చేయు పనులను తెలిసినప్పుడు అటువంటి వానికి వెంటనే కర్మ కాలిపోయి మోక్షము లభించును. ఉదాహరణకు భీష్ముడు ఏ

జ్ఞానమును తెలియలేదు, ఏ యోగమును చేయలేదు. అయినా శ్రీకృష్ణుడు భగవంతుడని తెలియగలిన దానివలన ఆయనకు మోక్షము లభించినది. భగవంతుడు వచ్చిపోయిన తర్వాత కనుగొనినా ఏమీ ప్రయోజనము లేదు. భగవంతుడున్న ప్రస్తుత కాలములో భగవంతున్ని తెలియగలిగిన వారికే మోక్షము పొందు అవకాశము గలదు. శ్రీకృష్ణుడున్నప్పుడు జీవించియున్న భీష్ముడు ఆయనను తెలియగలిగి సులభముగా మోక్షమును పొందాడు. కృష్ణుని తర్వాత భగవంతునిగా ఏసు రావడము జరిగినది. కృష్ణుని జన్మ ధనికునిగా ఉండేది. రెండవమారు కలియుగములో వచ్చిన ఏసు జన్మ చాలా పేదరికముగా ఉండేది. ఆయన కట్టుకొనే అంగీ కూడా రెండవది లేని పేదవాడుగా ఆయన జీవించాడు. కృష్ణుడు 126 సంవత్సరములు బ్రతకగలిగితే, ఏసు కేవలము 33 సంవత్సరములే బ్రతికాడు.

ఏసు తన జీవితములో అనేక కష్టములు, అవమానములు అనుభవించాడు. ఆయన సాధారణ మనిషికంటే ఎక్కువ కష్టములను, అట్లే ఎక్కువ అవమానములను పొందడము చూచి ఆయనను మనిషికంటే హీనముగా చూచారు తప్ప భగవంతునిగా ఎవరూ గుర్తించలేదు. ఏసు సజీవముగా యున్న రోజులలో 30 సంవత్సరముల వరకు జ్ఞానమును బోధించలేదు. చివరిలో మూడు సంవత్సరములు దైవజ్ఞానమును బోధించాడు. ఆ మూడు సంవత్సరములలో ఆయన చెప్పు బోధనుబట్టి ఆయనను భగవంతునిగా గుర్తించగల అవకాశమున్నా ఎవరూ గుర్తించ లేకపోయారు. దగ్గరగా యున్న శిష్యులలో ముఖ్యమైన 'పేతురు' అను శిష్యుడు కూడా ఆయన భగవంతుడని విశ్వసించలేకపోయాడు. ఏసు మీద ఎంతో భక్తిభావమున్నా కొన్నిచోట్ల ఏసును సంశయించాడు. చివరకు ఏసును గొప్ప జ్ఞానిగా గుర్తించాడు తప్ప, భగవంతునిగా తెలియ

లేకపోయాడు. ఏసు చనిపోయిన తర్వాత అనగా ఏసు శిష్యులను వీడి కనిపించకుండా పోయిన తర్వాత ఆయనను దేవుడని అనుకొనినా, భగవంతుడుగా వచ్చిన సాకార దేవుడని అనుకొనినా ఏమి ప్రయోజనము ఉండదు. దీనినిబట్టి భగవంతుడు మనుషుల మధ్యయున్నప్పుడే, ఆయన సజీవముగా యున్నప్పుడే తెలియుట వలన మోక్షము లభించునుగానీ, ఆయన పోయిన తర్వాత ఆయన భగవంతుడేయని చెప్పుకొనినా ప్రయోజనము లేదు.

దేవుడు మనిషిగా భూమిమీదికి వస్తే మనిషివలె ప్రవర్తించును. ఆయన శరీరములో జీవాత్మ ఉండుట చేత అన్ని అనుభవములను అనుభవ వించవలసియున్నది. భగవంతునిగా వచ్చువాడు ఎన్ని జన్మలకయినా ఒకడే వచ్చుచుండును. భగవంతుడయిన కృష్ణుని శరీరములో ఏ జీవుడు ఉన్నాడో, అదే జీవుడే ఏసుగా వచ్చినప్పుడు కూడా కలడు. భగవంతుడు ఎన్ని జన్మలలో వచ్చినా ఒకే జీవుడు, ఒకే ఆత్మయుండుట వలన మరియు ఒకే మనస్సు, ఒకే బుద్ధి యుండుట వలన ఆయనకు అన్ని జన్మలు జ్ఞాపకముండును. కృష్ణునిగా వచ్చినప్పుడు ఏమి జ్ఞానమును చెప్పాడో అదే జ్ఞానమునే ఏసుగా వచ్చినప్పుడు కూడా చెప్పాడు. అయితే చెప్పిన ప్రాంతము, చెప్పిన భాష వేరుగాయుండుట వలన కృష్ణుడు చెప్పినది, ఏసు చెప్పినది వేరువేరు జ్ఞానముగా యున్నట్లు కనిపించుచున్నది. వేరుగా కనిపించినా చివరకు ఇద్దరూ చెప్పిన వాక్యములోని సారాంశము ఒక్కటే యుండును. ఉదాహరణకు 'మూడు రెండులను కలిపితే ఆరు అయితుంది' అని చెప్పిన మాటను మరొకరు 'ఆరును మూడుమార్లు విభజిస్తే రెండు వచ్చును' అని చెప్పినా ఒక్కటే. రెండు మాటల సారాంశము ఒక్కటే అయినా రెండు మాటలు వేరువేరుగా కనిపిస్తున్నవి. అలాగే ముందు

చెప్పినవాడు, వెనుక చెప్పినవాడు ఇద్దరూ ఒకటే అయినా, వాడే వీడు అని గుర్తించనట్లు ఒకే జ్ఞానమునే వేరు భాషలో, వేరు విధముగా చెప్పాడు. అందువలన కృష్ణుడే ఏసుయని ఎవరూ గ్రహించలేకపోయారు. కృష్ణునిగా ఉన్నప్పుడు **'నేను అను భావము లేకుండా చేసిన దుష్టకార్యములోని పాపము అతనిని అంటదు'** అని అన్నాడు. ఆయనే ఏసుగా వచ్చినప్పుడు 'నేను అను భావముతో **'ఒక స్త్రీని మోహపు చూపు చూచినా అతడు అప్పుడే ఆమెతో వ్యభిచరించినవాడగును.'** ఆ పాపము వానికి వచ్చును. అక్కడ పాపము రాదు అని చెప్పినా, ఇక్కడ పాపము వచ్చునని చెప్పినా రెండు ఒకే భావముతో కూడుకొన్న జ్ఞానవాక్యములేయని ఎవరికీ తెలియదు. అందువలన వాక్యములను వేరువేరుగా తలువడమే కాకుండా ఆ వాక్యమును చెప్పిన ఇద్దరూ వేరువేరుగాయున్నవారని అనుకొందురుగానీ ఒక్కరేయని తెలియలేరు.

ప్రశ్న :- **దేవుడు నిరాకారుడనీ, భగవంతుడు ఆకారముగల సాకారుడనీ చెప్పడమేకాక వారు ఇలా ఉందురని, భగవంతుని శరీరములో జీవుడు ఇలా ఉండునని, ఆత్మ ఇలా ఉండునని చెప్పుచూ ఇవన్నీ రహస్యములని ఎవరూ గుర్తించలేనివని మీరు చెప్పుచున్నారు కదా! భగవంతుడు మూడవ పురుషుడని, ఆత్మ రెండవ పురుషుడని కూడా చెప్పి అదియూ రహస్యమైన విషయమనే చెప్పారు. ఇట్లు భగవంతుని గూర్చిన ఎన్నో రహస్యములను, ఎవరికీ తెలియని రహస్యములను మీరు దగ్గరుండి చూచినట్లు ఇంతవరకు చెప్పారు. ఎంతో రహస్యమైన ఈ విషయములన్నీ మీకు ఎలా తెలుసునని మేము ప్రశ్నించుచున్నాము. భీష్ముడు ఒక్కడే భగవంతున్ని తెలియగలిగాడని చెప్పిన మీకు భగవంతుని విషయములు ఎలా తెలిసాయి? అనుభవిస్తే గానీ తెలియని విధానము నీకు ఎలా తెలిసింది? ఈ ప్రశ్నలకు జవాబు**

**చెప్పవలసిన బాధ్యత మీకున్నది. అందువలన మాకు వివరముగా అర్థమగునట్లు తెలియజేయగలరని అనుకొంటున్నాము.**

**జవాబు :-** ఒక పండులోని రుచిని అంచనావేసి చెప్పడము అశాస్త్రీయము అవుతుంది. ఆ పండును తిని దాని రుచిని అనుభవించి చెప్పితే అది శాస్త్రబద్ధమవుతుంది. అందువలన నేను శాస్త్రబద్ధమైన జ్ఞానమును, ఎవరూ తప్పుబట్టని జ్ఞానమును మీకు అందివ్వాలని అనుకొన్నాము. అట్లు అందించుటకు నేను ముందు ప్రతి విషయమును అనుభవించి అందులోని సత్యమును తెలిసి మీకు తెలియజేయాలను ఉద్దేశ్యముతో భగవంతుని శరీరములోని విధానము తెలియుటకు నేను దేవున్ని అర్థించాను. అంతిమ దైవ గ్రంథములో (2-186) లో **"దేవుడు మీకు అత్యంత సమీపమున ఉన్నాడు. మీరు అడిగే ప్రతిమాటను వింటున్నాడు"** అని చెప్పినట్లు మరియు ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీతలో (15-16) శ్లోకములో **"మీతోనే దేవుడయిన ఆత్మ కూడుకొనియున్నది"** అన్నట్లు దేవుడు మన ప్రక్కనే యుండి మనిషి అడుగు ప్రతి విషయమును చూస్తున్నాడు. నేను అడిగినది ప్రపంచ విషయము కాదు దేవుని విషయము. అందువలన దేవుడే ఆ విషయమును నాకు తెలియజేయాలనుకొన్నాడు. 1974లో అప్పటికి నా వయస్సు 24 సంవత్సరములు, అప్పుడు నా శరీరములో ఏదో మార్పు జరిగినదనుకొంటాను. అలా ఎందుకు అనుకోవాల్సి వచ్చిందంటే నేను ఇతరులతో చెప్పుమాట తుచ తప్పక నెరవేరేది. అది ఎందుకు జరిగేదో అప్పుడు నాకు తెలియదు. ఉదాహరణకు ఆ కాలములో జూదములో నంబర్లకు డబ్బులు కట్టితే, కట్టిన నంబరు వస్తే దానికి విపరీతమైన డబ్బులు వచ్చేవి. ఒక రూపాయికి 95 రూపాయిలు వచ్చేవి. అప్పుడు కొందరు చదువురానివారు, మిగతావారు నన్ను డబ్బులు వచ్చే

నంబరు చెప్పమని అడిగేవారు. అప్పుడు వారికి డబ్బు పోతే ఇంకొకమారు నన్ను అడగరను ఉద్దేశ్యముతో ఏదో ఒక నంబరు నోటికొచ్చినది చెప్పి పంపేవాడిని. అప్పుడు వారికి డబ్బులు పోతాయి, రెండవమారు నన్ను అడగరు అని అనుకొనేవాడిని. అయితే మరుసటి రోజు నేను చెప్పిన నంబరే రావడము, ఆ నంబరు కట్టినవారికి విపరీతముగా డబ్బులు రావడము జరిగేది. దానితో మరీ రెట్టింపుగా మనుషులు వచ్చి నన్ను వచ్చే నంబర్ చెప్పమనేవారు. నేను చెప్పిన నంబర్ గ్రుడ్డిగా వచ్చిందిలేయని అనుకొనేవాడిని. మొదట అట్లు అనుకొనినా తర్వాత చెప్పిన నంబర్ కూడా వచ్చేది. వారికి వచ్చిన డబ్బులను చూచి నాకు కూడా ఆశ పుట్టేది. నేను అప్పుడు డబ్బులు లేని పరిస్థితులలో ఉండేవాడిని. అటువంటి సమయములో వచ్చే నంబర్ నేను వ్రాసి, రాని నంబర్ వారికి చెప్పాలనుకొని ఒకరోజు అలాగే చేశాను. అప్పుడు వారికి చెప్పినా రాదు అనుకొన్న నంబర్ రావడము, వస్తాది అనుకొన్న నేను వేసుకొన్న నంబర్ రాకపోవడము జరిగినది. అది ఒక విచిత్రముగా తోచినది. నేను ఇతరులకు చెప్పిన నంబర్ రావడమేమిటి స్వయముగా నేను వేసుకొన్న నంబర్ రాకపోవడ మేమిటి? యను ప్రశ్న మొదలయినది.

ప్రప్రథమముగా నాకు జరిగిన సంఘటనతో నాలో ప్రశ్న ఏర్పడినా ఆనాడు నాకు సమాధానము దొరకలేదు. మొదట ఈ సంఘటనకంటే ముందు భగవంతుని శరీరములో విధానమును తెలుపమని నేను కోరిన కోర్కెను మరచిపోయాను. నేను రెండవ ఆత్మనే కోరాలని, మూడవ ఆత్మను కోరకూడదని ఆనాడు నాకు తెలియదు. నేను దేవున్ని కోరానని మాత్రము తెలుసు. ఆ కోర్కె రెండవ ఆత్మ పరిధిలోనిదని నాకు తెలియదు. దేవుడు రెండు ఆత్మలుగా ఉన్నాడని తెలియకున్నా దేవుడే భగవంతుడుగా పుట్టునను

నమ్మకము ఉండేది. అయితే మూడవ ఆత్మయిన పరమాత్మ భగవంతునిగా వస్తాడని తెలియదు. అయినా నా కోర్కె భగవంతున్ని గురించి తెలుసు కోవలన్నది. నా కోర్కెను అనుసరించి జవాబు మొదలయినదని కూడా తెలియదు. ఇతరులకు చెప్పితే మాట నెరవేరడము, నాకు ఉపయోగ పడకుండాపోవడము నాకు తెలియజేయు జవాబులో భాగమని అప్పుడు నేను గ్రహించలేదు. ఆ విషయమును వదలివేసిన తర్వాత కొంతకాలమునకు నేను చెప్పితే ఇతరుల రోగములు నయమైపోయేవి. ఎక్కడ నయము కావు అన్న రోగములు కూడా నోటిమాటతోగానీ, చేతి స్పర్శతోగానీ నయమైపోయేవి. నా మాటకు అంత గొప్ప శక్తి ఎలా వచ్చినదో నాకు తెలియదు. అయితే ఆ శక్తి నాకు ఇంతకుముందు లేదు, ఇప్పుడు ఎక్కడి నుండి వచ్చినదని ఆలోచించేవాడిని అయినా ఆనాడు అంతా అగమ్య గోచరముగా యుండేది.

ఈ విధముగా బయటి పనులు నాకు తెలియకుండా నా ప్రమేయము లేకుండా, నా శక్తి ఏమాత్రము కాకుండా నెరవేరేవి. అప్పుడు అదంతయూ నా వలన జరుగలేదని తెలిసినా, ఎవరి వలన జరిగేవో తెలిసేది కాదు. నాకు తెలియని రహస్యమేదో ఉన్నదని మాత్రము అనుకొనేవాడిని. ఈ విధముగా కాలము గడువగా క్రమేపీ బయట విషయములలోనే అశ్చర్య పడవలసిన విషయములు కాకుండా లోపలి జ్ఞాన విషయములలోనే ఇతరులు బోధకులుగా యున్నవారు, గురువులుగా యున్నవారు చెప్పిన బోధలకు వ్యతిరేఖముగా కొన్ని, వేరుగా కొన్ని బోధలను నేను చెప్పడము ప్రారంభించాను. నేను చెప్పిన బోధలు నాకు ముందు తెలిసినవి కావు. నేను ఎక్కడా నేర్చినవి కావు. అయినా నేను చెప్పిన బోధలు శాస్త్రబద్ధముగా ఉండడమే కాకుండా ఇతరులు చెప్పిన దానికంటే సత్యముగా యుండేవి.

కాలము గడచుకొలదీ పెద్దపెద్ద దైవ రహస్యములను చెప్పెడివాడను. అంతా సంచలనమైన బోధలను చెప్పడమేకాక గ్రంథరూపములో వ్రాయను మొదలుపెట్టాను. గ్రంథములు కూడా ఇతరులను బాగా ఆకర్షించేవి. ఇదంతయూ గమనిస్తే ప్రపంచములోనే జ్ఞానములో నేనే మొదటివాడినని తెలిసినది.

వాస్తవముగా నాకు భగవద్గీత శ్లోకములను చదివేదానికి రాదు. ఒక్క శ్లోకమును కూడా చూడకుండా చెప్పలేను. సంస్కృత పదములను పలికే దానికి రాదు. అయినా **"త్రైత సిద్ధాంత భగవద్గీత'** అను పేరుతో భగవద్గీత శ్లోకములకు భావములను వ్రాయడము జరిగినది. అద్వైత సిద్ధాంతమును చెప్పిన శంకరాచార్యులు, విశిష్టాద్వైతమును చెప్పిన రామానుజాచార్యులు, ద్వైత సిద్ధాంతమును చెప్పిన మధ్వాచార్యులు చెప్పిన బోధలను వారి సిద్ధాంతములను అతిక్రమించి నేను త్రైత సిద్ధాంతమును చెప్పడము, ఆ సిద్ధాంతము ద్వారా ఇంతవరకు ఎవరికీ తెలియని జ్ఞానమును చెప్పడము, మొదలగు విషయములను చూస్తే ఇదంతా నాకు ఏమాత్రమూ తెలియదు. నేను ఎక్కడా నేర్వలేదు. అలాంటిది నేను ఎలా చెప్పాను! అని నాకే అశ్చర్యమయినది. అప్పటికి కూడా ఆ విధముగా ఎందుకు జరుగు చున్నదో తెలియలేదు. హిందువులలో సిద్ధాంత జ్ఞానమును, సంచలన జ్ఞానమును, రహస్య జ్ఞానమును నేను అందించడము జరిగినది. తర్వాత అదే విధముగా ఇతర దైవ గ్రంథములయిన బైబిలు గ్రంథములో క్రైస్థవులకు తెలియని జ్ఞానమును చెప్పడము జరిగినది. బైబిలులో కొన్ని వాక్యములకు ఇంతవరకూ తెలియని వివరమును చెప్పి క్రైస్థవులను సంతృప్తిపరచడమైనది. అట్లే అంతిమ దైవగ్రంథమయిన ఖుర్ఆన్‌లో కొన్ని వాక్యములు చాలా సూక్ష్మ వివరముతో కూడుకొన్నవిగా యుండి ఇంతవరకు ముస్లీమ్‌లకు

అర్థముకానివిగా యున్నవి. వాటిని చాలామంది తప్పుగా అర్థము చేసుకొని యుండడము వలన ఆ వాక్యములకు శాస్త్రబద్ధముగా పూర్తి అర్థమును వివరముగా నేను వ్రాయడము జరిగినది. ఖుర్‌ఆన్ గ్రంథములోని అర్థము కాని కొన్ని వాక్యములను తీసుకొని **"అంతిమ దైవ గ్రంథములో జ్ఞాన వాక్యములు"** అని ఒక గ్రంథమును, **'అంతిమ దైవ గ్రంథములో వజ్ర వాక్యములు"** అని మరొక గ్రంథమును వ్రాయడమైనది. ఈ విధముగా రెండు దైవ గ్రంథములలోని వాక్యములకు నేను ఎలా వివరమును వ్రాయగలిగానో నాకు అర్థముకాని విషయమైనది. ఆ రెండు గ్రంథములు ముందుగా ఏమాత్రము పరిచయము లేవు. అయినా ఆ గ్రంథములలోని వాక్యములకు వివరమును తెలిపి ఎందరో ముస్లీమ్‌ల చేత, క్రైస్థవుల చేత ప్రశంసలు పొందడము జరిగినది.

దైవజ్ఞానములో ప్రపంచములోనే అత్యున్నతమైన జ్ఞానము నావద్ద నుండి వస్తున్నదని కొంతవరకు అర్థమయినది. నాకు తెలియని వాటిని నేను ఎలా వ్రాయగలను? అను ప్రశ్న వచ్చినప్పుడు, ద్వితీయ దైవ గ్రంథమయిన బైబిలులోని వాక్యము ఒకటి జ్ఞాపకమొచ్చినది. అది ఈ విధముగా కలదు చూడండి.

**(మత్తయి 10-20) "మీ తండ్రి ఆత్మ మీలో యుండి మాటలాడు చున్నాడే గాని మాటలాడువారు మీరు కాదు."**

ఈ వాక్యమును నేనే ఇతరులకు వివరముగా చెప్పాను. నేను చెప్పిన వివరము ప్రకారము ఎవరూ స్వయముగా మాట్లాడడము లేదనీ, అట్లే ఎవరూ ఏ పనిని చేయడము లేదనీ, మనుషులు చేయు పనులను, మనుషులు మాట్లాడు మాటలను నీకు తండ్రియైన దేవుడు మాట్లాడుచున్నాడు

తప్ప నీవు మాట్లాడలేదని వాక్య వివరమును చెప్పాను. ఆ వివరము ప్రకారము నేను వ్రాసినది నా తండ్రియైన ఆత్మ వ్రాశాడు తప్ప నేను కాదుయని అర్థమయినది. నేను ఏమి చేసినా, ఏమి వ్రాసినా అది అంతయూ నేను వ్రాసినది కాదని తెలిసిపోయినది. అయితే నేను వ్రాసినది ఎవరూ ఎందుకు వ్రాయలేకపోయారను ప్రశ్న కూడా వచ్చినది. దానికి జవాబుగా ప్రపంచ విషయములయితే నీవు చేసినది ఎవరయినా చేయవచ్చును. అట్లే నీవు మాట్లాడినది ఎవరయినా మాట్లాడవచ్చును. ఇక్కడ మనము మాట్లాడునది ప్రపంచ విషయములను కాదు, గ్రంథరూపముగా వ్రాసిన జ్ఞానము అందరూ చెప్పునది కాదు. అనగా అందరి శరీరములోని ఆత్మ ప్రపంచ విషయములను అందరియందు చేసినట్లు, దైవ విషయములను కొందరి చేతనే పలికించును, వ్రాయించును. అందులోను సత్యబద్ధమైన జ్ఞానమును తాను ఎన్నుకున్న మనిషి ద్వారానే చెప్పించును. అదే విధముగా 'నా వద్దకు అత్యున్నత జ్ఞానము వచ్చుటకు ఆత్మయిన దేవుడు నన్ను ఎన్నుకున్నాడని' అనుకొన్నాను. దాని ప్రకారము నా శరీరమునుండి ఆత్మే ఉన్నతమైన జ్ఞానమును బోధించుచున్నదని నాకు తెలిసిపోయినది.

దేవుడు నన్ను నియమించుకొని, నా ద్వారా తన జ్ఞానమును బోధించడము నాకు పెద్ద వరములాంటిదే అయినా నేను కోరుకొన్నది భగవంతుని శరీరములో ఆత్మ ఏ విధముగా ప్రవర్తించుచున్నది? ఏ విధముగా జ్ఞానమును బోధించుచున్నదని తెలియాలని, ఆ అనుభవమును నేను పొందితే ఇతరులకు అనుభవపూర్వకముగా చెప్పగలను యని నేను అనుకొన్నాను. దానికి జవాబుగా నాలోని ఆత్మ నా బుద్ధికి అందించిన సమాచారము ఇలా కలదు. భగవంతుని శరీరములో ఆత్మ ఇటు ప్రపంచ విషయముల యందు ముందే నిర్ణయించబడిన కర్మప్రకారము ప్రపంచ పనులు చేయు

చుండును. తర్వాత అప్పటికి అవసరమైన ధర్మములను తెలియజేయు నిమిత్తము జ్ఞానమును స్వయముగా బోధించుచుండును. ఇప్పుడు నీ శరీరములోని ఆత్మ నీ కర్మ ప్రకారము ప్రపంచ పనులు చేయుచున్నది. అలాగే నేడు ఎవరికీ తెలియని, ప్రపంచములోనే ఉత్తమమైన జ్ఞానమును భగవంతుని శరీరములో బోధించినట్లే బోధించుచున్నది. ఇప్పుడు భగవంతుని శరీరములో ఉన్నది, నీ శరీరములో ఉన్నట్లే కదా! భగవంతుని శరీరములో జరిగినట్లే నీ శరీరములో జరుగుచున్నది కదా! నీవు భగవంతుని శరీరములో జరుగు విధానమును గురించి అడిగావు, కావున భగవంతుడు బోధించు ఉత్తమమైన జ్ఞానమునే నీ చేత చెప్పించుచున్నాము. అప్పుడు నీవు భగవంతుని శరీరములో యున్న విధానమును అనుభవించినట్లే కదా! అందరు బోధకులు చెప్పు సాధారణమైన జ్ఞానమును నీవు చెప్పియుంటే, అది భగవంతుని శరీరములోని ఆత్మ చెప్పినట్లు కాదని తెలిసిపోతుంది. ఎందుకనగా! అది సాధారణ బోధగా యుండును. భగవంతుడు బోధించు బోధ అసాధారణముగా ఉండును. ఎవరూ భూమిమీద బోధించనిదిగా యుండును. శాస్త్రబద్ధమైనదిగా, సత్యసమేతమైనదిగా ఉండును. ఇప్పుడు నీ ద్వారా వచ్చు బోధ ప్రపంచములో ఏ మానవుడు బోధించని అత్యున్నత మైన బోధ అయినప్పుడు, నీవు పొందిన అనుభూతి లేక అనుభవము భగవంతుని శరీరములోనిది కాదా! నీవు భగవంతుని విధానమును అనుభవించినట్లు అయినందున నీవు కోరిన కోర్కెను దేవుడు నెరవేర్చినట్లు కాదా! ఇందులో నీకు ఏదయినా అనుమానమున్నదా? అను జవాబు దొరికినది.

అప్పుడు నా బుర్రను ఉపయోగించి ఆలోచిస్తే లోపలి నుండి వచ్చిన సమాధానము సత్యమేయని అర్థమయినది. అప్పటినుండి నా

ద్వారా వచ్చు జ్ఞానమును నేను చెప్పడము లేదు, నాలోనున్న ఆత్మయే (దేవుడే) చెప్పుచున్నాడని అందరితో చెప్పుచున్నాను. నా మాటను వినిన కొందరు నా మాటలోని సత్యమును తెలియక "ఆయన చెప్పు జ్ఞానమును తాను చెప్పినానను అహము లేకుండా చెప్పుచున్నాడు'' అని అనుకొంటున్నారు. అంతేగానీ ఇదంతయూ భగవంతుని శరీరములో జరిగినట్లు జరుగుచున్నదనీ, అత్యున్నతమైన జ్ఞానమును చెప్పువాడు ఆత్మే అయినా, అది భగవంతుని శరీరములో చెప్పినట్లు ఉన్నతమైన జ్ఞానమే చెప్పబడుచున్నదని అర్థము చేసుకోలేక పోయారు. చెప్పే జ్ఞానమును వింటున్నా ఇది ఉత్తమమైన జ్ఞానమనీ, దీనిని భగవంతుని ఆత్మ తప్ప ఎవరూ చెప్పలేరని తెలియలేకున్నారు.

కొందరు నా శరీరములోని ఆత్మ నా కోర్కెను అనుసరించి ఉన్నతమైన జ్ఞానమును చెప్పితే దానిని అర్థము చేసుకొను స్థోమత లేనివారు నేను చెప్పునది జ్ఞానమేకాదనీ, అజ్ఞానమును బోధించుచున్నాడని అంటున్నారు. వారు అలా అనినప్పుడు దేవుడు వారికి జ్ఞానమును ఎందుకు అర్థమగునట్లు చేయలేదని అనిపించుచుండును. అందరికీ ఉన్నతమైన జ్ఞానము అవగాహన కావడము లేదు అన్నది ప్రశ్నగా నిలిచిపోగా! దానికి జవాబు కూడా ఈ విధముగా తెలిసినది. దేవుని జ్ఞానము మీద శ్రద్ధయున్న వానికి మాత్రమే దేవుడు చెప్పు జ్ఞానము అర్థము కాగలదు. శ్రద్ధ లేనివానికి భగవంతుడు చెప్పిన బోధలు అర్థము కావని తెలియుచున్నది. మనిషికి ఉన్న శ్రద్ధనుబట్టి జ్ఞానము అర్థమవడము లేక అర్థము కాకుండా పోవడము జరుగుచున్నది. జ్ఞానమును నమ్మేవారు దేవుని ఆకార రూపము (భగవంతుడు) చెప్పిన జ్ఞానమును అర్థము చేసుకొన్నప్పటికీ, చెప్పబడిన జ్ఞానము భగవంతుని ద్వారా వచ్చినదని నమ్మలేదు. సాధారణ బోధకుడు

చెప్పిన బోధగానే నమ్ముదురు. చెప్పినవాడు సాధారణ మనిషిగానే కనిపించును గానీ, భగవంతుడు చెప్పిన జ్ఞానము వినినా భగవంతున్ని గుర్తించలేరు. దేవుడు ఎట్లు తెలియబడడో భగవంతుడు బోధ చెప్పినప్పటికీ, ఆయన బోధ ఉన్నతమైనదిగా ఉన్నప్పటికీ, ఎంత తెలివైనవారైనా ఇతనే భగవంతుడని గుర్తించి చెప్పలేరు. భగవంతున్ని గుర్తించలేనప్పుడు భగవంతునికి వ్యతిరేఖము చేయడము జరుగుచుండును. అంతేకాక భగవంతున్ని కొన్ని విషయములలో విభేదించి, ఆయనను అవమానించు చున్నారని భగవద్గీత గ్రంథములో కూడా చెప్పారు.

ఒక మనిషిలో రెండు కోణములున్నవని ముందు చెప్పుకొన్నాము. సాధారణ మనిషి శరీరములో జీవుని కోణము ఒకటి, ఆత్మ కోణము మరొకటి యుండును. దేవుని శరీరమైన భగవంతునిలో జీవుని కోణము ఉండదు. భగవంతునిగా పుట్టినవాడు పరమాత్మ అయినందున ఆయనకు ప్రకృతి సంబంధ గుణముల వలన ఏర్పడిన కర్మలేనందున, ప్రస్తుతము అనుభవించుటకు పరమాత్మ అనుకొన్న ప్రకారము ఏర్పడియుండుట వలన అది ప్రకృతి కర్మకాదు. అందువలన అన్ని అనుభవములు నిర్ణయించబడిన లేక క్రొత్తగా తయారు చేయబడిన కర్మ ప్రకారము ఉండుట వలన భగవంతునిలో జీవుని కోణము ఉండదు. భగవంతుని శరీరములో ఆత్మ, జీవాత్మలను, పరమాత్మ స్వయముగా విభజించియుండుట వలన ఆత్మల విషయములోగానీ, కర్మ విషయములోగానీ సర్వ సాధారణ మనిషిలాగా ఉండక భగవంతుని శరీరము ప్రత్యేకమైనదిగా ఉండును. అందువలన భగవంతుని శరీరములో కూడా రెండు కోణములున్నా ఒకటి ఆత్మ కోణము, రెండు పరమాత్మ కోణము ఉండును. అన్ని శరీరములలో ఆత్మ పని చేయుచుండగా, జీవాత్మ పనులలో వచ్చిన ఫలితమైన కష్టసుఖములను

అనుభవించుచుండగా, పరమాత్మ సాక్షిగా చూస్తూయుండును. అయితే భగవంతుని శరీరములో ఒకే పరమాత్మ మూడు ఆత్మలుగా ప్రస్తుతానికి విభజింపబడియుండుట చేత జీవాత్మ ఆత్మ ఒక ప్రక్క, పరమాత్మ ఒక ప్రక్క యుండుట చేత, రెండు కోణములు భగవంతుని శరీరములో ఉండును. అయితే జీవాత్మ అందరి శరీరములలోలాగా వచ్చిన అనుభవములను అనుభవించుచుండగా, ఆత్మ ప్రత్యేకమైన జ్ఞానము చెప్పు కోణములో యుండగా, పరమాత్మ అందరి శరీరములలో యున్నట్లు సాక్షిగా మాత్రము లేకుండా అప్పుడప్పుడు బయట ప్రకృతి మీద తన దృష్టిని సారించి ఎప్పుడయినా అవసరమొస్తే అరుదుగా ప్రకృతికి సూచనలిచ్చి నడుపుచుండును.

ద్వాపర యుగములో కృష్ణునిగా వచ్చినప్పుడు భారతయుద్ధములో (కురుక్షేత్ర యుద్ధములో) భగవంతుని శరీరములోని పరమాత్మ ప్రకృతిని శాసించి **'మధ్యాహ్న కాలమును సాయంకాలముగా మార్చి ఇతరులందరూ సాయంకాలమైనదని భ్రమించునట్లు చేశాడు.'** అట్లే కలియుగమున ఏసుగా వచ్చినప్పుడు భగవంతుడయిన ఆయన శరీరములోని జీవుడు సాధారణ కష్టసుఖములను అనుభవించునట్లు ఆత్మ కోణము నుండి ఆత్మ పని చేయుండగా, పరమాత్మ ఏసు జీవితములో ఒకమారు **'సముద్రమును, తుఫానును శాసించి'** తన ఉనికిని చాటుకొన్నాడు. ఈ రెండు యుగముల లోని రెండు అవతారములలో ప్రకృతిని శాసించినట్లు కొందరికి తెలుసు. అయితే త్రేతాయుగములో భగవంతుడు ఎవరు? అన్నది ప్రజలకు తెలియకుండా పోయినది. త్రేతాయుగములోని భగవంతున్ని కొందరు పనిగట్టుకొని చెడుగా ప్రచారము చేయుట వలన ఆయనను సాధారణ మనిషిగా కూడా లెక్కించడము లేదు. అటువంటి సందర్భములో

భగవంతున్ని గుర్తించుటకు అవకాశమే లేదు. సర్వసాధారణముగా భగవంతున్ని గుర్తించుట దుస్సాధ్యమని చెప్పుకొన్నాము.

అయితే కొందరు జ్ఞానులు భగవంతుడు చెప్పిపోయిన జ్ఞానమును గుర్తించి దాని ఆధారముగా ద్వాపర, కలియుగములలోని భగవంతులను సూచనప్రాయముగా గుర్తించగలిగారు. అయితే త్రేతాయుగములోని భగవంతుడు చెప్పిన జ్ఞానమును చూచి ఆయనను గుర్తించుటకు అవకాశముండినా, అప్పుడు వచ్చిన భగవంతున్ని ముందుగానే దుర్మార్గునిగా కొందరు చిత్రించి చూపడము వలన, ఆయన జ్ఞానమును కూడా చూడకుండా ప్రక్కన పెట్టి, ఆయనను ఒక దుర్మార్గునిగా లెక్కించడము జరిగినది. అందువలన మేము ఆయన జ్ఞానము గొప్పదని చెప్పినా ప్రజలు వినరు. కావున మేము జ్ఞానమును చూచి ఫలానా ఆయన భగవంతుడని చెప్పుటకు బదులుగా ఆయన కోణములో ప్రకృతిని శాసించిన సంఘటనను బట్టి ఆయన భగవంతుడని బయటికి చెప్పుచున్నాము. కలియుగములో ప్రకృతియైన 'సముద్రమును తుఫానును పరమాత్మ శాసించగా', ద్వాపర యుగములో 'సూర్యున్ని శాసించడము' జరిగినది. ఇకపోతే త్రేతా యుగములో మొత్తము **'నవగ్రహములను శాసించి, అనూహ్యముగా అందరిని ఒక వరుసలో పెట్టడము జరిగినది.'** ప్రకృతిలో భాగము లయిన మొత్తము నవగ్రహములన్నిటినీ శాసించిన ఘటననుబట్టి అతను దేవుడయిన భగవంతుడని గుర్తించాము. ఆయన అప్పటి కాలములో ఉత్తమమైన జ్ఞానమును చెప్పినా, ఆయన జ్ఞానమును చూచి ఆయనను గ్రహించలేకున్నా, ప్రకృతి సంఘటననుబట్టి అప్పటి భగవంతున్ని గుర్తించ గలిగాము. అలా గుర్తించబడినవాడే రావణబ్రహ్మ. రావణబ్రహ్మను గురించి ఎవరో చెప్పినది విని చెడ్డవాడని నిర్ణయానికి రాకుండా, జాగ్రత్తగా చూస్తే తప్పనిసరిగా రావణబ్రహ్మను భగవంతునిగా గుర్తించవచ్చును.

మనిషి శరీరములో జీవుని కోణము, దేవుని కోణము రెండు ఉండగా, భగవంతుని శరీరములో ఆత్మ కోణము, పరమాత్మ కోణము అని రెండు కోణములు గలవు. సాధారణ మనిషిలోనూ, భగవంతునిలోను ఆత్మ ఒకే విధమైన పనిని చేసినా, పరమాత్మ సాధారణ మనిషిలో సాక్షిగా మాత్రమున్నవాడు భగవంతుని శరీరములో ప్రకృతి మీద జోక్యము చేసుకొని స్వయముగా ప్రకృతిని శాసించుచున్నాడు. ప్రకృతిని శాసించు విధానమును బట్టి త్రేతాయుగములో రావణబ్రహ్మను కనుగొనగా, మిగతా రెండు యుగములలో జ్ఞానమునుబట్టి భగవంతులను కనుగొనడము జరిగినది. ఇదంతా నాకు స్వయానా తెలిసిన విధానమును నేను తెలుపడము జరిగినది. భగవంతుని శరీరములోని స్వయం అనుభవమును తెలిసి మీకు తెలుపడము జరిగినది. భగవంతుని విధానమును తెలియాలను కోర్కెను దేవున్ని కోరి ఆ కోర్కె ప్రకారము నేను అనుభవించిన అనుభవము ప్రకారము తెలియజేశాను తప్ప నా స్వయముగా వ్రాసినది ఏదీలేదు. ఈ గ్రంథము ద్వారా మీ బయటి ధ్యాసను లోపలికి పెట్టి, మీలోని రెండు కోణములు ఎలా ఉన్నవో తెలియగలిగితే, మీరు దేవునికి (ఆత్మకు) దగ్గరై మోక్షమును (పరమాత్మను) చేరవచ్చును. మీరందరూ పరలోక రాజ్యమైన మోక్షమును పొందాలని కోరుచూ ముగిస్తున్నాము.

## సమాప్తము

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**

**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**

# ఒక వ్యక్తి రెండు కోణములు

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు
























































































